12-6-1992 శుక్రవారం 12 పేజీలు సంపుటి :63 సంచిక :24 విడిప్రతి : రు. 1.50 లు

Regd. No. H.N.L. 18

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



# పివి అంత పొరపాటు చేస్తాడా?

హిమయత్ నగర్ ఉప ఎన్నిక రాష్ట్ర రాజకీయాలపై పిడుగులాగా పడింది. ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డికి, అసమ్మతీయులకు మధ్య ప్రత్యక్ష యుద్ధానికి నాంది పల్కింది. కాంగ్రెస్‌లో అంతర్గత ఘర్షణలే కాక, ప్రతిపక్షాలతో రభసకూ కారణ భూతమయ్యేట్లుంది. హిమయత్ నగర్ ఎన్నిక ఫలితం - కాంగ్రెస్‌కు ప్రతికూల మనేది స్పష్టంగా తెలుస్తున్న నిజం. అందుకే అభ్యర్థి శ్రీ జగన్నాథరావు అంత ఆగం చేస్తున్నారు. పోలింగు ప్రారంభమైన కొద్ది సేపటికే ఓటమి వాతావరణం ప్రతిఫలించడంతో, జగన్నాథరావు గారిలో కంపరం మొదలైంది. ప్రధానమంత్రితో తనకున్న స్నేహం దృష్ట్యా, రాష్ట్ర నాయకులందరూ తనను గెల్పించి తీరు తారన్న ధీమాలో వుండినా దాయన. ఆ బింకంతోనే, తాను గెలిచినట్లు, ముఖ్యమంత్రి అయిపోయినట్లు కలలు కన్నారు; పత్రికా ప్రకటనలు చేశారు. పి యం తన హితుడై నప్పుడు చిల్లర మల్లర నాయకులతో తనకేమి [illegible] అన్న ధోరణిలో ఎన్నికల ప్రచారానికి ఎవరి సహాయాన్నీ తీసుకోలేదు. బి జె పి అభ్యర్థి శ్రీ నరేంద్ర ఒక పథకం ప్రకారం

> హిమయత్‌నగర్ నిప్పు ఎరవ్వ
> రాజకీయ దావాగ్నిని ప్రేరేపిస్తుంది!

ఇటు ప్రచారాన్ని, అటు పోలింగు కేంద్రాల ఆక్రమణను నిరాఘాటంగా జరిపేసుకున్నారు. పోలింగు సమయంలో కాని జగన్నాధరావు కలదెలుసు కోలేక పోయారు. అప్పటికే పరిస్థితి చేయి దాటి పోయింది. దానికి తోడు రిగ్గింగుకు తలపడుతుండిన కాంగ్రెస్ కార్యకర్తలను, సుధాకరరెడ్డి వంటి నాయకులను కూడా పోలీసులు అరెస్ట్ చేయడంతో ఆయనకు గంగ వెర్రులెత్తిపోయింది. కోపమంతా ముఖ్యమంత్రి పైకి మళ్ళింది. హనుమంత రావు వంటి అసమ్మతీయులు ప్రక్కన చేరి రెచ్చగొట్టారు. పదేళ్ళ ప్రవాస జీవితం తర్వాత రాజకీయ పునరావృతం చేయబోతే ఎదురు దెబ్బ తగలడం ఓటమి పరాభవం ఖాయమని తెలడంతో ఆయన తట్టుకోలేక పోయారు.

ఢిల్లీలో పెద్దలకు ఏమని మొర పెట్టుకున్నారో, ఎంత దీనంగా పరిస్థితి విన్నవించుకున్నాడో కాని ప్రధాని పివి ఓట్ల లెక్కింపుకు బ్రేకు వేశారు. తిరిగి పోలింగు జరిపించాలన్నది జగన్నాథరావు పట్టుదల. రాష్ట్ర ఎన్నికల సంఘం ఈ విషయంలో స్వేచ్ఛను కోల్పోయింది. ఢిల్లీలోనే ఏ నిర్ణయమైనా జరగాలి! మొత్తం ఎన్నికను రద్దుచేసి పోలింగును నిర్వహించడం సాధారణ విషయం కాదు. హిమయత్ నగర్‌లో అంతటి తప్పిదాలు జరిగాయని ఎవరూ విశ్వసించ లేకున్నారు. ప్రధానితో స్నేహం వున్నంత మాత్రాన ఎన్నికల నిబంధనలు మార్చడం వీలౌతుందా? అసలు పివి, ఎన్నికల కమిషన్ వ్యవహారాలలో జోక్యం చేసుకునేటంత పొరపాటు చేస్తాడా? ఒక్క అసెంబ్లీ స్థానం కోసం, ఒక స్నేహితుడిని సంతృప్తి పరచడం కోసం ప్రజాస్వామ్య ప్రతిఘాతానికి పాల్పడు తాడా? ప్రతిపక్షాలు సృష్టించే దుమారాన్ని ఎదుర్కొంటాడా? ఇవన్నీ ప్రశ్నలే.

కాని, ఓట్ల లెక్కింపు నిల్పివేయడం మాత్రం రాష్ట్రంలో పెద్ద రాజకీయ సంక్షోభానికి దారితీస్తుంది. కాంగ్రెస్ వాదులు ముఖ్యమంత్రి శ్రీ జనార్ధన రెడ్డి పై దాడికి సన్నాహాలు చేస్తుంటే, ప్రతిపక్షాలు కాంగ్రెస్ పార్టీపై సమరానికి కత్తులు నూరుతున్నాయి. ఎన్నికల కమిషన్ ఢిల్లీ వత్తిడికి లొంగిపోలింగు రద్దు చేస్తే మాత్రం – దాన్నిక జాతీయ సమస్యగా ఉద్యమం నడపడానికి బిజెపి సిద్ధపడుతూంది. కాంగ్రెస్ పై దాడికి [illegible] అవకాశంగా

కొరవ 7 పేజీలో

# పినాకిని తీరం

## శాసనసభ్యుల సానుభూతి !

చిన్న పత్రికల దుస్థితిని గూర్చి శాసనసభ్యులు జె.కె.రెడ్డి, విష్ణువర్ధన రెడ్డి గారలు మొన్న నెల్లూరులో జరిగిన ఒక చిన్న పత్రికా సభలో చాలా సానుభూతి వ్యక్తం చేశారు. ఈ విషయమై తాను ముఖ్యమంత్రితో కూడా మాట్లాడినట్లు శ్రీ జె.కె. వెల్లడించారు. జమీన్‌రైతు వజ్రోత్సవ సమయంలో ఈ విషయమై తాము ఒక నివేదిక సమర్పించినట్లు శ్రీ విష్ణువర్ధన రెడ్డి చెప్పారు. నివేదిక ఇచ్చిన విషయం నాకు తెలియదుగాని, చిన్న పత్రికల పట్ల పై ఇరువురికి వున్న సానుభూతికి నా హృదయ పూర్వక ధన్యవాదాలు.

జె.కె., విష్ణుగారలకే గాదు, ఏ శాసనసభ్యుడికి చిన్న పత్రికల మీద సానుభూతి వుండదు చెప్పండి ! మంత్రులు, ముఖ్యమంత్రులకే దిన పత్రికల విలేఖరుల మీద వల్లమాలిన ప్రేమాభిమానాలు వుండేటప్పుడు స్థానిక శాసన సభ్యులకు, స్థానికంగా వున్న చిన్న పత్రికల పట్ల సానుభూతి వుండడం సహజం. కాని శాసనసభ్యులు చేయ వలసింది నివేదికలివ్వడం, నివేదించడం, ఎవరైనా పత్రికల వారు తమను సభలకు పిలిచినపుడు వేదిక మీద సానుభూతి ప్రకటించడం కాదు; తమ వాణిని ఎంతో దృఢంగా, ఎంతో చిత్తశుద్ధితో వినిపిం చడానికి ఆందోళన చేయడానికి, ప్రభుత్వం చేత సముచితమైన తమ కోర్కెను అంగీకరింప జేయడానికి వారికి సొంత వేదిక వుంది – అదే శాసనసభ. శాసనసభలో శ్రద్ధాసక్తులతో మాట్లాడ గలిగితే, ఆందోళన చేయగలిగితే, జీవచ్ఛవంగా వున్న చిన్న పత్రికల బ్రతుకులను ప్రభుత్వ దృష్టికి తేగలిగితే, సమాచార శాఖ మంత్రి – సమాచార శాఖ కమీషనరు గార్ల మనసుకు వచ్చేటట్లు ఒత్తిడి తేగలిగితే, ఇతర వేదికల మీద ఫలితం లేని సానుభూతిని ప్రదర్శించాల్సిన అవసరం లేదు. మన శాసనసభ్యుల్లో ఎవరైనా, ఎప్పుడైనా ముక్కు బడిగా ఒక్కసారైనా, చిన్న పత్రికల బాధామయ బ్రతుకులను గూర్చి ప్రస్తావించారా? పెట్టుబడి దార్ల పత్రికలు స్థానిక పత్రికల గొంతు పిసికి చంపేస్తున్నాయని మాట్లాడారా? లేదేమిలేదు! అదేమీ లేకుండా 'లిప్ సింపతి' వల్ల ఏమి ప్రయోజనం?

చిన్న పత్రికలకు కూడా పూర్వం ప్రభుత్వం ప్రకటనలిచ్చేది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ ఇచ్చేవి; పత్రికల మధ్య ప్రకటన రేటులో మాత్రం తేడా వుండేది. ఇప్పుడు కేంద్రం చిన్న పత్రికలకు ప్రకటనలివ్వడం మానేసింది; రాష్ట్ర ప్రభుత్వం ధనికులను మరింత ధనికులను చేసే సిద్ధాంతంతో పెట్టుబడి దార్ల పత్రికలను పెంచి పోషిస్తున్నది. సొంత కాళ్ల మీద నిలబడి, తన వ్యక్తిత్వం మీద ఆధారపడి చిన్న పత్రికనేది నడిస్తే నడవాలి; లేకుంటే చావాలి; మార్గాంతరం లేదు!

చిన్న పత్రిక లంటే నిర్వచించడం సంకటమైన సమస్య! సంవత్సరంలో యాభై రెండు వారాలు క్రమం తప్పకుండా కష్టనష్టాల నెదుర్కొని నిరాఘాటంగా నడిచేవి చిన్న పత్రికలే; చేతిలో పైసలున్నపుడు, ఏదైనా ప్రకటన వచ్చినపుడు, విశేషమైన సందర్భం ఏర్పడినపుడు, తీరిక వున్నపుడు నామమాత్రంగా వెలువడేవి చిన్న పత్రికలే! ఈ సమస్య ముఖ్యంగా హైదరాబాదు నగరంలో, ప్రధానంగా ఉర్దూ పత్రికలకు సంబంధించి వుంది. అడ్రసు కూడా లేని పత్రికలు, కిరాణా విలాసం వుండే పత్రికలు అక్కడ కోకొల్లలు. అవి ప్రకటనల కోసం పుట్టిన పత్రికలేగాని, పాఠకుల కోసం కాదు. ఈ పరిస్థితుల్లో వేటికివ్వాలి, వేటికి ఇవ్వవలసిన అవసరం లేదనే సమస్య ప్రభుత్వాన్ని వేధిస్తున్నట్లున్నది. చిన్న పత్రికలకు సహాయ పడాలనే మనసుండాలే గాని, అది పరిష్కరించ లేనంత, గిడగియ లేనంత సంక్లిష్ట సమస్యగాదు!

చిన్న పత్రికలు చిన్న పత్రికలు అని గోలజేసే మనం అనుసరించాల్సిన మార్గం కూడా వుంది. పత్రికా రంగం, పత్రికా వ్యాసంగం ధనార్జనకు సులభ మార్గమనే అభిప్రాయంతో జమామాషీగా నడపడం పొరపాటు; ఒక్క పేజీ అయినా క్రమం తప్పకుండా రావాలి; అందులో అంకిత భావం, చిత్తశుద్ధి ప్రతిబింబించాలి. పత్రికా రంగంలో వున్న సోదర పాత్రికేయులకు పాఠాలు చెప్పడం నా వుద్దేశ్యం కాదు; అనుభవరీత్యా నాకున్న అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నాను; అంత మాత్రమే. నిజామాబాద్‌లో ట్రిపా రామదాసు అనే అనుభవ శూన్యుడైన యువకుడు దృఢ సంకల్పం, పట్టుదల, నిజాయితీలే పెట్టుబడిగా 'కేకలు' అనే వారపత్రికను ప్రారంభించారు. ఆన్నేళ్ల నుండి అది దిగ్విజయంగా నడుపుతుండడమే గాక, దానికి తోడు 'ప్రొద్దు' అనే స్థానిక దినపత్రికను పెట్టారు; దాని హైదరాబాదు ఎడిషన్‌కు ముఖ్యమంత్రి జనార్ధన రెడ్డి గారి చేతనే ప్రారంభోత్సవం జరిపించుకున్నట్లున్నారు. అటు వార పత్రిక, ఇటు దినపత్రిక క్రమం తప్పకుండా వస్తున్నాయి. పూరకే రావడం కాదు, ఆసక్తి కరమైన వార్తలు విమర్శలతో విజయ వంతంగా వెలువడుతున్నాయి. అందులో రామదాస్ ఒక్కడే కాదు, అతని భార్య, అతని సోదరులు అందరూ పనిజేస్తారు. ఎడిటర్లు, సబ్ ఎడిటర్లు, విలేఖరులు, కంపోజిటర్లు, మెషీన్ మెన్ అన్నీ వారే! తొలి రోజుల్లో సలహా కోసం 'జమీన్‌రైతు' కు వచ్చి పోతుండిన రామదాసు, ఈనాడు జమీన్‌రైతు కే పత్రికా నిర్వహణ నేర్పే అనుభవాన్ని గడించగలిగాడు. స్థానిక పత్రికల నిర్వాహకులు రామదాసును మార్గ దర్శకంగా తీసుకోవాలని నా అభిప్రాయం.

స్థానిక పత్రికల దురవస్థలు ముఖ్యమంత్రి శ్రీ జనార్ధన రెడ్డికి బాగా తెలుసు, కాని దయ కలగాలి; కలిగితే క్షణాల్లో విద్యుద్వేగంతో చేసి వేయగలరు. ఆ దయ కలిగేదెప్పుడు? పున్నయ్య కూటు (ధాన్యాగారం) తీసే సరికి, లేనయ్యకు ఆకలితో ప్రాణం పోయినట్లు స్థానిక పత్రికల గతి ఆ విధం కాగూడదని నా కోర్కె!



## ప్రకటనలతో పేరు వస్తుందా ?

నేటి రాజకీయ యువతరంలో పెద్ద జాడ్యం వ్యాపించి వుంది. తెగ తెరకెక్కి పేరు కావాలి; పేరు రావాలి; అందరికీ తన పేరుతో బాటు తన ముఖం కూడా పరిచయం కావాలి. దాని కోసం పత్రికలలో ప్రకటనలు; బిల్లులు తాము చెల్లించి మిత్రులందరూ తమకు అభినందనలు, శుభాకాంక్షలు తెలిపినట్లు తామే ప్రకటన లిచ్చుకోవడం; వాటిని చూచి తామే మురిసి పోవడం; ఇతరులలో మేలకనభావం ఏర్పరచడం. ఇది పరమ అసహ్యంగా వుంటున్న నేటి తరం యువతపోకడ! మా 'పాలికుడు' అయితే తనదైన సొంత భాషలో సూటిగా చురక తగిలించి వుండు ఆ భాష, ఆ హక్కు ఆయనొక్కడి సొత్తే!

సెన్సార్ బోర్డు సభ్యత్వమనేది ప్రజలకు సంబంధించింది కాదు; ప్రజలు తెలుసుకో దగింది కాదు. ప్రజలకు ఎరుక పరచ వలసింది కాదు; ప్రజలకు ప్రయోజన కరమైంది కాదు. అందులోనూ పదుల సంఖ్యలో సభ్యత్వం కల ఆ బోర్డులో ఒకటి రెండు ఏపాటి ? వాటికి ఏమి ప్రాధాన్యం? మన జిల్లాలో ఒక కావలి కాంగ్రెస్ యువకుడికి ఆ సభ్యత్వం వచ్చింది; చిన్న చిన్న ప్రకటనల ద్వారా ఆ యువకుణ్ణి పత్రికల ద్వారా అభినందించారు. అతనికి రావలసింది సెన్సార్ బోర్డు సభ్యత్వం కాదు; రాజకీయాల్లో చాల సంవత్సరాల నుంచి తలమునకలుగా వున్న వాడు కాబట్టి అతనికి ఏదైనా రాజకీయ పదవి వచ్చి వుండాలి; అటువంటిది తనకు తగినది కాని సెన్సార్ బోర్డు సభ్యత్వానికి సంబర పడడమనేది అమాయకత అవుతుంది.

కొంప 11 పేజీలో

# జమీన్‌రైతు

## ఇదేమి రాజకీయం ?

రాజకీయమా నీ పేరు రాక్షసియం. అని ఎప్పుడో ఒక నవలాకారుడు వ్రాసినట్లు గుర్తు; ఆంధ్ర రాజకీయాలకు అతికిపోయే నిర్వచనం ఇది. రాజ్యం వీరభోజ్యం అన్న రాజులకాలం నాటి క్షాత్రధర్మాలను ఇప్పటి రాజకీయ వాదులు బాగా వంట పట్టించుకుంటున్నారు. బాంబులు వేసో, కత్తులు దూసో, హత్యలు చేసో, దొంగ ఓట్లు గుద్దో, బ్యాలెట్ పెట్టెలు మాయం చేసో, పోలింగు బూతులపై బాంబుల వర్షం కురిపించో, ఓటర్లను తుపాకి చూపి బెదిరించో, భయపెట్టో ఎన్నికల్లో గెలవగలిగిన వాడే మొనగాడు; నలభై ఏళ్ల ప్రజాస్వామ్యం మనకు నేర్పిన నీతి ఇది. తమ అభ్యర్థులు ఈ ఘాతుకాలన్నీ నిరాటంకంగా జరుపుకొని, విజయమాల మెడలో వేసుకోవడానికి ఏర్పాట్లు చేయగల్గిన ప్రభుత్వమే ప్రభుత్వం; పార్టీయే పార్టీ. అది చేతకాని వాళ్లు అసమర్థులు. - అవజ్ఞులు, అవ్యక్తులు, అవతారులు, అపభ్రంశులు, అన్నిటినీ మించి వట్టి చవటలు. జనం కూడా ఎవరు గెల్చారన్నది చూస్తున్నారు కాని, ఎట్లా గెల్చారన్నది చూడడం లేదు. అందుకే గెల్చిన ప్రతివాడూ తనది ప్రజాస్వామ్య విజయమంటున్నాడు; ఓడిన ప్రతి వాడూ ప్రత్యర్థి రిగ్గింగ్ దౌర్జన్య ఫలమని ఆక్రోశిస్తున్నాడు.

హిమయత్ నగర్‌లోనైనా, ఆళ్లగడ్డలోనైనా జరిగిందిదే! సాక్షాత్తు ప్రధాన మంత్రి పోటీ చేసిన నియోజక వర్గం లోనే రిగ్గింగ్ సజావుగా సాగిపోయినప్పుడు. అప్టరాల్ అసెంబ్లీ స్థానమనగా ఎంత? ప్రజలను మెప్పించి, ఒప్పించి ఓట్లు రాబట్టుకోవాలే కాని, ప్రజలను ఇళ్లలోనే పెట్టి, పెట్టెలు నింపుకోవడం తప్పుబాబూ అని ప్రధాని చెప్పగలడా ఇప్పుడు?

జగన్నాథరావు గారికి ప్రత్యక్ష రాజకీయాలతో పరిచయం పోయింది; ప్రధాని హితుడన్న క్వాలిఫికేషన్ ఒక్కటే ఆయనకు సీటు రావడానికి కారణం. అంత మాత్రాన ఆయన అందరికీ ఇష్టుడు కావాలని లేదుకదా? టికెట్ అయితే తెచ్చుకోగల్గాడు, కాని తనను భుజాల పై మోసి, గెల్పించే వారిని సంపాదించుకోలేక పోయాడు. స్వంతంగా నడవడానికి అనారోగ్యం అడ్డు; శక్తి లేదు. ప్రత్యర్థి నరేంద్ర ఢక్కామొక్కీలు తిన్నవాడు; సిటీలో ప్రత్యంగుళం కొట్టిన పిండి. ఫలితం – నరేంద్ర రిగ్గింగు ముందు జగన్నాథరావు పిఎం ఫ్రెండ్‌షిప్ పనిచేయలేదు. ఆడలేక మద్దెల ఓడన్నట్లు – రాష్ట్ర ప్రభుత్వం మీద నింద వేస్తున్నారు. పోలీసులు, రిగ్గింగ్‌కు పాల్పడే కార్యకర్తలను అరెస్ట్ చేయడం తప్పా? బాంబులు పట్టుక తిరుగుతున్న వారిని పట్టుకోవడం నేరమా? ఎంత స్వంత పార్టీ ప్రభుత్వమైతే మాత్రం, తమను రిగ్గింగుకు అనుమతించలేదని అన్యాపదేశంగా వ్యక్తపరుస్తూ ఆక్రోశించడమేమిటి? ఇదెక్కడి వితండవాదం?

దొంగ ఓట్లు వేయడానికి వెళ్తూ, మారణాయుధాలతో సహా– ఒక యువకాంగ్రెస్ నాయకుడు పోలీసులకు పట్టుబడ్డాడు. అతడ్ని అరెస్ట్ చేస్తే పోలీసు స్టేషన్ ఎదుట పికెటింగ్ జరిపారు. ఇంకొక ప్రక్క గ్రుద్దుకో గల్గినంత గ్రుద్దుకొని, అలివి కానిచోట్ల తప్పిపోయిందనే బాధ తో బిజెపి కూడా రిగ్గంగని గోల చేస్తుంది. మొగుడ్ని కొట్టి మొగసాలకెక్కడ మంటె ఇదేనేమో!

ఒక రాష్ట్ర రాజధానిలో, విద్యావంతులకు నిలయమైన నగరంలో జరిగే ఎన్నికలలో రిగ్గింగు జరగడం రిగ్గింగును నిరోధించారని ఆగం చేయడం కంటె ప్రజలు సిగ్గుపడాల్సిన విషయం. మరొకటి వుండదు. ఎక్కడో బీహార్ మారుమూలగ్రామాలలో పోలింగు దౌర్జన్యాల గురించి ఇది వరకు వార్తలు వినేవాళ్లం. ఆ దుర్మార్గాలిప్పుడు ఆఖరుకు రాష్ట్రరాజధాని నగరానికి కూడా ప్రాకిన తర్వాత – ఈ దేశంలో ప్రజాస్వామ్య వ్యవస్థ కొనసాగింపు అవసరమా అది అనర్థదాయకం కాదా అనే సందేహం కల్గుతూంది. ప్రజలను పోలింగు బూతులకు తీసుకవచ్చి, ఓట్లు వేయించే పద్ధతి పోయి; పోలింగు బూతులాక్రమించి తామే ఓట్లు గ్రుద్దుకోవడానికి రాజకీయ పార్టీలు పోటాపోటీ పడే పరిస్థితి వచ్చిన తర్వాత ఇక ఎన్నికలు ఎందుకు? అసెంబ్లీలెందుకు? రాను రాను మన రాజకీయ పార్టీలు, నాయకులు ఎందుకింత పతనమౌతున్నారు ఎందుకింత నిస్సిగ్గుగా ప్రజాస్వామ్యాన్ని పరిహసించి, హతమారుస్తున్నారు? దీనికి నిష్కృతి లేదా? బాంబుల వీరులను, రిగ్గింగ్ వాదులను మనం మన పాలకులుగా భరించవలసిందేనా? ఈ విషవ్యాధికి మందు కనిపెట్టేవాడే లేడా?

## జమీన్‌రైతు

8 పేజీలు అణా

12-6-42

### నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

ఉత్తరఖండం పేష్కారు కుమారుడికి 5 వ ఉపనయనమైందనీ, 5వేలుదాకా చదివింపులు వచ్చాయనీ, 5వ తేది రాలేనివారు 6తేదిగూడా చదివింపులతో వచ్చారనీ వార్త. చదివింపులు, లంచాల క్రిందకు రావని అలహాబాదు కాంగ్రెసు తీర్పు.

***

నార్త మోపూరులో ఈ మధ్య మాలలు కొందరు, నురిసిన ధాన్యం అపహరించగా పల్లెటూరి మర్యాద ప్రకారం వారిని కొట్టారనీ, మాలలంతా కట్టుగావచ్చి అనాదు పేరయ్యకు జరిపిన మర్యాద! ఈనాదు వెంకయ్య కుటుంబానికి జరిపారని వార్త. మేం యిదివరకు జోస్యం చెప్పినట్లే జరిగింది. ఇప్పటికైనా ఎవరైనా తప్పుచేసివుంటే చెంపలువేసుకుని రౌడీలకు అనువివ్వకుందురుగాక.

***

పర్మిట్ యిన్‌స్పెక్టరుగారూ! బృందావనంలో హాయింటి ప్రక్కన స్త్రీలు స్నానం చేస్తుంటే ఎవడో కొంటె కుర్రవాడు మీ మిద్దె మీదనుండి చూస్తున్నాడట. విచారించి గూబలు వాయించండి.

***

ముత్తుకూరునుండి వచ్చే ప్రతి బస్సు S.I.వల్ల అరగంట ఆలస్య మంటుంటారే ఎందువల్ల?

### నెల్లూరు వార్తలు

నెల్లూరు కుమ్మరి వీదినుండి గలాటాల్లో లేచిపోయిన హిందువుల్లో 12 కాపురాలవార్ని మొన్న 8 తేది నెల్లూరు

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

హిందూ మహాసభ వారు మరల చేర్పించారు. అబ్బా! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు.

***

జంగిడీధిలో 9 తేది సోదాజేసి తలుపులు, ద్వారబంధాలు, కిటికీలు, వగైరాలు రెండుబండ్ల సామాను పోలీసు వారు పట్టుబరచుకొనిరి.

***

నెల్లూరు తాలూకాఫీసు లక్ష రూపాయల చోరీ కేసులో గవర్న మెంటువారు కోరిన ప్రకారము దేశ రాజాలుగ్రామీణ- పెగ్రాజా వెంకట్రమణయ్య గార్లు ఆనరరీ సి.ఐ.డీలుగా పనిచేసినందుకు పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ వారు పై యిద్దరికి మొన్న 4 తేదిన ఒక్కొక్కరికి సుమారు రు 150లు విలువ జేసే గ్రౌ మెడల్సు బహూకరించారు.

### ప్రళయము

-నారప రెడ్డి రామిరెడ్డి

ఏ దిక్కు జూచినా<br>
ఏ దారికేగినా<br>
ఈ ప్రళయ దృశ్యాలె<br>
ఈఘోర యాతనలె<br>
కష్టాలకెనేను జీవింతునా?<br>
సౌఖ్యాలకై నేను యాచింతునా?<br>
నాయమృతపుపాత్ర<br>
నష్టపరిచారెవరు<br>
కాలకూటము దీన<br>
కలిపియుంటారెవరు<br>
అమృతము కొరకునై దుఃఖింతునా?<br>
కాలకూటముత్రావి మరణింతునా ?<br>
ఈ వర్ణకుటీకెవరు<br>
ఇంధనము బెట్టారు<br>
నామధుర వీణనే<br>
నలగద్రొక్కి్కారు<br>
మంటలోబడి నేనె మరణింతునా ?<br>
శిధిలవీణియ కొఱకు చింతింతునా ?

# కరెంట్‌కు కాంగ్రెస్ చేసిందేమిటి?

కరెంట్‌కోత రాను రాను భరించలేనంత ఘోరం తయారౌతూంది. కరెంట్ లేనపుడు ఇంట్లో వుంటే ప్రాణవాయువులేని చీకటి గదిలో మ్రగ్గిపోతున్న ఫీలింగ్ కల్గుతూంది; ప్రత్యక్ష నరకం కన్పిస్తున్నది. ఏమిటీ దారుణ దుస్థితి? ఏడేళ్ల తెలుగుదేశం అధ్వాన్న పరిపాలనలో అన్ని అభివృద్ధి కార్యక్రమాలతో పాటు, విద్యుత్ ఉత్పత్తి నిర్లక్ష్యానికి గురై. నిధుల కొరతతో నిల్చిపోయిన మాట నిజమే. ఎన్టీఆర్ గారి హయాంలో ఒక్కటంటె ఒక్క అదనపు యూనిట్ ఉత్పత్తికి ఏర్పాట్లు జరగని మాట నిజమే. కాని, ఆ పీడ వదలి, కాంగ్రెస్ ప్రభుత్వం వచ్చిన తర్వాత ఆ పరిస్థితి సరిదిద్దడానికి తీసుకున్న చర్యలు ఏమున్నాయి? కొత్త విద్యుత్ ప్రాజెక్టుల నిర్మాణానికి ఏమి చర్యలు తీసుకుంటున్నారు. ఎవరి యాజమాన్యంలో కొత్తకేంద్రాలు రావాలో తెల్సుకొనేందుకే పుణ్యకాలం గడిచిపోతె. ఇక అవి కట్టెదెప్పుడు? కరెంట్ కొరత తీరేదెప్పుడు? ప్రజనరకయాతన అనుభవించాలి. పరిశ్రమలు మూతపడే పరిస్థితి కల్పించే, అభివృద్ధిని నిరోధించే తీవ్రాతి తీవ్ర సమస్య పట్ల సైతం ప్రభుత్వం ఇంత నిర్లక్ష్యంగా వుండడం దారుణం. కాంగ్రెస్ పెద్దలు తమ అశ్రద్ధను మాని, కరెంట్ ఉత్పత్తిని తక్షణం పెంచడానికి అవసరమైన చర్యలు చేపట్టాలి; ప్రజలను అంధకారం నుంచి రక్షించాలి.

– జి.ఎస్. రెడ్డి

నెల్లూరు

### కోవూరుకూ సేవలందించండి

ముఖ్యమంత్రి సతీమణి శ్రీమతి రాజ్యలక్ష్మి గారు తన రాజకీయ కార్యకలాపాల న్నింటిని వెంకటగిరికి పరిమితం చేస్తున్నారు. ఆమె తన సేవలను పుట్టినిల్లయిన యల్లాయపాళెం గ్రామానికి విస్తరింపజేయాలని మనవి. కోవూరు నియోజక వర్గం – భవిష్యత్‌పై ఆశ, ఆలోచన వున్న కాంగ్రెస్ వాదులకు అనుకూలమైన ప్రదేశమే. వెంకటగిరి వాసులవలె కోవూరు ప్రజలూ ఆమెకు

## జనవాణి

బ్రహ్మరథం పట్టారు. ఎక్కడికో పోయి ప్రజలను అర్థించే కంటె, స్వంతజనం అభిమానం పొందడం మంచిది కదా? యల్లాయపాళెం సమస్యల పరిష్కారానికి మనసు పెట్టడం ద్వారా, కోవూరు తాలూకాలో, రాజకీయ కార్యకలాపాలకు నాంది పల్కాలని కోరుతున్నాను.

- టి వి నారాయణ

యల్లాయపాళెం

### నంది ఉత్సవం నిరాశ పరిచింది

నెల్లూరులో జరిగిన నంది అవార్డుల ఉత్సవం ఎంతో నిరాశ పరిచింది. ఆటోలకి, రిక్షాలకు డబ్బు దండగ చేసుకొని వ్యయ ప్రయాసలకు ఓర్చి వెళ్తే, ఉత్సవం చూసిన ఆనందం మిగలక పోగా, మహిళలు, పిల్లలు చాలా ఇబ్బందులు పడవలసి వచ్చింది ఆహ్వాన పత్రాలపై వివిధ విభాగాలున్నట్లు వ్రాశారు గాని, లోపలకు వెళ్ళిన తర్వాత ఎదురైంది- త్రొక్కిసలాటె.

–శ్రీరామశశికళ

నరుకూరు

కొరవ 11 పేజిలో

# ఎంతచేసినా విమర్శలేనా?

## ఏడాదిన్నర కాలంలో ముఖ్యమంత్రి జిల్లాకు 112 కోట్లు తెచ్చాడు!

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దన రెడ్డి నెల్లూరు జిల్లాకు చేసిన వాగ్దానాలపై దిన పత్రికలలో వస్తున్న వార్తలు ఆశ్చర్యం కల్గిస్తున్నాయి. మాటలు తప్ప చేతల్లో జరిగిందేమీ లేదన్న అభిప్రాయాన్ని కల్గిస్తున్నాయి. జిల్లా వాసులు ఆశ పెట్టుకొన్న మెడికల్ కాలేజీ, థర్మల్ స్టేషన్ వంటి వాటిని ప్రక్కన బెడితే, సభల్లో జనార్దన రెడ్డి చేసిన వాగ్దానాలు, వేసిన పునాది రాళ్ళు మాత్రం నల్లపోలేదు. ముఖ్యమంత్రి అయిన ఈ పద్దెనిమిది నెలల కాలంలో ముఖ్యమంత్రి 58 వాగ్దానాలు చేశారు. వాటిలో ఒకటి, రెండు తప్ప అన్నీ అమలులోకి వచ్చేశాయి. మొత్తం వాగ్దానాలకు అయ్యే వ్యయం 112 కోట్లు. ఒకే ఒక్క సంవత్సరంలో వంద కోట్ల నిధులు జిల్లాకు తరలి రావడం సామాన్య పనా?

మొట్టమొదటి పర్యటనలో, వి.ఆర్. హైస్కూల్ సభలో చేసిన తొలి వాగ్దానం నెల్లూరు రోడ్ల రిపేరు అప్పుడే జరిగిపోయింది. మునిసిపాలిటీకి అప్పుడు 50 లక్షలిచ్చారు; రక్షిత నీటి పథకాలు పూర్తి చేయడానికి 50 లక్షలు వచ్చాయి. గ్రామీణ రోడ్ల రిపేరుకు చెప్పిన, ఆరున్నర కోటిలో, దాదాపు రెండున్నర కోట్ల ఖర్చయినాయి; తక్కిన పనులూ జరుగుతున్నాయి. నెల్లూరు బైపాస్ రోడ్డుకు 3 కోట్ల 28 లక్షల నిధులు వచ్చాయి; భూసేకరణ పూర్తయింది; టెండర్లు పిల్లి దశలో వుండిపని. నెల్లూరు కోర్టు భవనాలకు కోటి 60 లక్షలు విడుదలైనాయి; మరొక కోటి 40 లక్షలు వస్తాయి. 3 కోట్ల 80 లక్షలతో తలపెట్టిన వెంకటగిరి 132 కెవిఎ సబ్ స్టేషన్ పైనెలలో ప్రారంభం కానుంది. వెంకటగిరిలోనే రెండు కోట్ల 27 లక్షలతో తలపెట్టిన హ్యాండ్ ల్యూమ్ టెక్నాలజీ సంస్థ నిర్మాణం ప్రారంభమైంది. నెర్రి కాలువకు ఇస్తానన్న కోటి 20 లక్షలు ఇచ్చాయి. మొన్న జనవరిలో రిపేరు ప్రారంభమైంది. మర్రి పూట్ల వాగును 82 లక్షలతో రిపేరు చేస్తున్నారు ; రామాపురం నీటి పథకానికి రెంకోట్ల 20 లక్షలు మంజూరై, టెండర్లు పిలువబోతున్నారు. రాచర్లపాడు రోడ్ సైడ్ మోటల్ నిర్మాణం మొదలైంది. సోమశిల ప్రాజెక్ట్ కాలువలకు 5కోట్ల నిధులు వచ్చాయి. రెండు కోట్ల వెంకటగిరి పోలీసు బెటాలియన్ స్థాపన జరిగిపోయింది.

నెల్లూరులో ఎసి సుబ్బారెడ్డి కూరగాయల మార్కెట్ నిర్మాణానికి మార్చి 6 తేది రెండు కోట్లు విడుదల చేశారు. మార్కెటింగ్ శాఖ ఈ పని చేపట్టింది. స్వర్ణముఖి పై బ్యారేజి నిర్మాణానికి 8 కోట్ల అంచనాల పరిశీలనలో వున్నాయి. పన్నెండు కోట్లతో వున్నాయి. జిల్లాలో వివిధప్రదేశాలలో లింక్ రోడ్డులు, రోడ్డు బ్రిడ్జిలు నిర్మిస్తున్నారు. జన్నవాడ కాజ్‌వే పునర్నిర్మాణానికి మళ్లీ రెండు కోట్లు మంజూరైనాయి.

ఇవన్నీ సాధారణంగా అధికారుల స్థాయిలో జరిగిపోయే పనులు. నిధులు మంజూరైనా, టెండర్లు, గిండర్లు వంటి అధికార తతంగం వల్ల ఆలస్యమయ్యేందుకు అవకాశం వున్న పనులు. అందువల్ల అవి ప్రజల కళ్లలో అంతగా పడటం లేదు. ఎక్కడో గుమ్మపాటి పాళెంలో కట్టే బ్రిడ్జి, వెంకటగిరిలో వేసే రోడ్డు ముఖ్యమంత్రి హామీల అమలుగా జిల్లా కంతటికీ తెలిసే అవకాశమే లేదు కదా? అయితే ముఖ్యమంత్రిగా జనార్దన రెడ్డి కృషి వల్ల, జిల్లా కంతటికీ ఉపయోగపడే సంస్థలూ ఎన్నో వచ్చాయి. వాటిలో ప్రథమమైనది చేపల కాలేజి –ఎమ్‌సెట్ పరీక్షలలో ఇంజనీరింగ్, మెడికల్ కోర్సులతో పాటు చేపల కోర్సుకూ ఈ ఏడాది పరీక్షలు నిర్వహిస్తున్నారు. నెల్లూరు రైస్ రీసర్చ్ స్టేషన్‌లోనే ఈ కాలేజీకి తాత్కాలికంగా వసతి కల్పించారు. ఆ స్టేషన్ భూములలోనే కొంత భాగం చేపల పాండ్లుగా మారుస్తున్నారు. ప్రిన్సిపల్ సిబ్బంది నియామకం జరిగిపోయింది.

వెంకటగిరిలో నిమ్మ పరిశోధనా సంస్థ నెలకొన్నది. 50 రకాల నిమ్మచెట్లతో నర్సరీలు పెంచుతున్నారు. దీని ఫలితం రైతులకు అందుబాటు కావాలంటే మరొక మూడు నాలుగేళ్లు పడుతుందేమో!

మెడికల్ కాలేజి సైతం ఈ ఏడాదిలోనే ప్రారంభమయ్యే సూచనలు కన్పడుతున్నాయి.

ఎసి స్టేడియం నుంచి మద్రాసు బస్టాండు వరకు నెల్లూరు రోడ్డు వెడల్పు చేయడం, జనార్దన రెడ్డి ముఖ్యమంత్రి కాకుంటే ఎప్పటి కైనా జరిగే పనేనా? అరవయ్యేళ్ల పై నుంచి ఎడారి వలె వుండిన ఎసి స్టేడియంకు శాపవిమోచనం చేసింది జనార్దన రెడ్డి గారే! నెల్లూరు క్రీడాభిమానులకు శాశ్వతోపకారం ఇది. స్టేడియం పూర్తయితే, జాతీయ స్థాయి

కొరవ 11 పేజీలో

**58 వాగ్దానాలలో పెండింగ్‌లో పడ్డవి రెండంటే రెండు!**

## సణుగుడు

### హర్షద్ మెహతాకు జై బోలో!!

హర్షద్ మెహతాను అరెస్ట్‌చేసి, అన్యాయంగా లాకప్‌లో తోయడం పట్ల నా తీవ్రనిరసన ప్రకటిస్తున్నాను; మెహతాలో అంతర్గతంగా వున్న ప్రతిభను గుర్తించి, గౌరవించలేని భారత దేశం దౌర్భాగ్యాన్ని నిశితంగా నిందిస్తున్నాను; తాము చేయలేని పనిచేసి చూపించాడన్న కుళ్ళుతో మెహతాను ముప్పుతిప్పలు పెడుతున్న ఆర్థిక మంత్రిత్వ శాఖను అభిశంసిస్తున్నాను.

3వేల కోట్ల ప్రజాధనం అప్పణంగా దిగమింగితే దిగమింగాడు గాక, అందులో ఎంత ప్రావీణ్యం చూపించాడని? 30 వేల అప్పుకు మూడు చెరువుల నీళ్ళు త్రాగించి, తాతముత్తాతల కాలంనాటి ఆస్తిపాస్తుల పత్రాలు పెరుక్కొని, ఏడాది త్రిప్పిన తర్వాత, ఏడు జతల చెప్పులు అరిగిన తర్వాత ముష్టి విదిల్చినట్లు విసిరేసే బ్యాంకులనుంచి, ఏకంగా 3 వేల కోట్లు కాగితం పత్రం లేకుండా తీసుకోగల్గిన సమర్థుడికి జై బోలో అనడం అనుచితమా? అసలు నన్నడిగితే హర్షద్‌మెహతాను పెట్టాల్సింది జైలులోకాదు; ఐ ఎం ఎఫ్ ఆఫీసులో! భారత ప్రభుత్వం ప్రతినిధిగా మెహతాను అమెరికాకు పంపితే, ఆర్థిక మంత్రి ఇల్లు కదలాల్సిన అవసరం లేకుండా, ఐ ఎం ఎఫ్ ఛైర్మెనాదులను బోల్తా కొట్టించి, వేలవేల కోట్ల డాలర్లు తరలించుక రాగల సత్తా మెహతాకు వుందని నా ప్రగాఢ విశ్వాసం. పది పదిహేను బ్యాంకుల ఛైర్మెన్లను తన ఇంటి కాపలి కుక్కల కంటె హీనంగా తన చుట్టూ త్రిప్పుకోగల్గిన వాడికి ఐ ఎం ఎఫ్ ఛైర్మెన్ ఒక్కర్ని మాయచేయడం పెద్ద లెక్కా! ఆర్థిక మంత్రి పోయి అప్పు తెస్తె, వడ్డీ కట్టాలి; రూపాయి విలువ తగ్గించాలి; సబ్సిడీలు రద్దు చేయాలి; బడ్జెట్ ఏమిటో ముందు చెప్పాలి; తల తాకట్టు పెట్టాలి; కాళ్ళకు మ్రొక్కాలి అదే మెహతాను తమ్ముంటె సంతకం కూడా పెట్టకుండా తెస్తాడు. దేశానికింత సేవ చేయాల్సినవార్ని, సేవ చేయదగిన వార్ని కటకటాల వెనక నిలబెడితే ఎంత బాధేస్తుంది చెప్పండి?

— డోలేంద్ర

కొరవ 7 పేజీలో

## సింహపురి

## ఏదడిగినా డబ్బులేదు

### ఇక మునిసిపాలిటీ మాత్రం ఎందుకో!

నెల్లూరు మునిసి పాలిటీలో పౌరులకు అవసరమైన ఏ చిన్న అభివృద్ధి కార్యాన్నైనా చెల్లిగవ్వలేరట. రోడ్డు అడిగితే డబ్బులేదు; వీధి దీపం అడిగితే డబ్బులేదు; కాలిపోయిన బల్బు వేయమంటే డబ్బులేదు; మురుగు కాల్వకట్టమంటే డబ్బులేదు; వీధుల్లో పేరుకున్న చెత్త తొలగించ మంటే డబ్బులేదు; తుప్పు పట్టి పోయిన ట్రాక్టరును బాగు చేయించడానికి డబ్బులేదు; నెట్టలేక చస్తూ బ్యాటరీ వేయించమంటే డబ్బులేదు; శానిటరీ ఇన్‌స్పెక్టర్లు తదితర సిబ్బందిని టవున్ పెరుగుదలకు అనుగుణంగా పెంచ మంటే డబ్బులేదు; వాటర్ మెయిన్‌లను విస్తరించమంటే డబ్బులేదు; కొళాయి వెయ్యమంటే డబ్బులేదు; పాడుబడిన పార్కులను సక్రమంగా నిర్వహించమంటే డబ్బులేదు; డబ్బులేదు డబ్బులేదు అనే మాట మునిసిపాలిటీకి తారకమంత్రం అయిపోయింది! దేనికి డబ్బులేకుంటే మునిసిపాలిటీ ఎందుకున్నట్టు? అదీ లేకుండా పోతే చిక్కే లేదు!

పన్నులు వగైరాల వల్ల వచ్చిన నాలుగు పైసలు ట్రంకురోడ్డును అంతచందాలతో తీర్చిదిద్దడానికే సరి పోవడం లేదని ఒక మాట. మద్రాసు బస్టాండు వద్ద రోడ్డు వెడల్పు చేయడానికి; ఏ.సి స్టేడియం వద్ద సిటీ సౌందర్యం వుట్టి పడేట్లు రోడ్డు రూపురేఖలు మార్చేందుకు, ప్లాట్ ఫారాల నిర్మాణానికి, విద్యుత్ స్తంభాలు మార్చి పెద్దలైట్లతో జిగేల్ మనిపించడానికి విధిగా ఖర్చు చేయవలసి వచ్చినందువల్ల మామూలు అభివృద్ధి పనులకు 'నిల్‌బ్యాలెన్స్' అంటున్నారు.

మునిసిపాలిటీ దివాలా తీయ డానికి ఇవే కారణమనడం అసంబద్ధంగా వుంటుంది. జాతీయ రహదారి వెడల్పు చేసి తీర్చిదిద్దడానికి, అందంగా [illegible] అమర్చడానికి ఆయాశాఖలు ఆ ఖర్చు[illegible] భరించవచ్చు; ఆయాశాఖలు అందుకు అనుమతించగం [illegible] వ్యయ భారాన్ని కూడా మునిసిపాలిటీ మీద వేయడం మూలిగే నక్కమీద తాటికాయ పడవేయడమే అవుతుంది. స్పెషల్ ఆఫీసరుగా వున్న కలెక్టర్ గారు గాని, సర్వాధికారి గా వున్న కమీషనర్ గాని ఈ విషయంలో ముఖ్యమంత్రిని స్పెషల్ గ్రాంటులు అడిగి సంపాదించి వుండవచ్చు. వీరు అడిగివుంటే; వీరేగాక నెల్లూరు టౌన్‌నగర సౌందర్యం సంత రించుకుంటున్నందుకు ఆనందిస్తున్న శాసనసభ్యులూ ఒత్తిడి తెచ్చివుంటే ముఖ్యమంత్రి ప్రత్యేక గ్రాంటును మంజూరు చేసి వుండే వారేమో!

మునిసిపల్ పరిపాలన అస్తవ్యస్తంగా అదుపు ఆజ్ఞ ఆలనపాలన అబందరిగా అసుర్థంగా లేకుండా. ఉన్నదా అనిపిస్తున్నది. ఆర్థికంగా దివాలా తీయడానికి, అవసరమైన ఒక చిన్న అభివృద్ధి కార్యం చేపట్టలేకపోవడానికి ఇదే ప్రధాన కారణం కాకూడదు. ముఖ్యమంత్రి శ్రీ జనార్దన రెడ్డి మునిసిపాలిటీ ఆర్థిక దుస్థితిని గుర్తించి వెంటనే స్పెషల్ గ్రాంటు ఏదైనా మంజూరు చేయడం అవసరం.

### దాహం.. దాహం..

నెల్లూరు టౌన్ దాహంతో అలమటించి పోతూంది. నీళ్ల కోసం కటకట లాడిపోతూంది. మరొక వారం, పది రోజులు ఎండలు ఇట్నే మండితే జనం అల్లాడి పోతారు!

ఐదారేళ్ల క్రితం, జన్నతాహుసేన్ కలెక్టర్ గావున్న రోజుల్లో ఏర్పడిన దారుణ నీటి కొరత ఈ ఏడాది పునరావృతమయ్యే ప్రమాదం కన్పిస్తుంది. రోజు రోజుకూ సూర్యభగవానుడి ప్రతాపానికి అడ్డే లేకుండా పోతున్నది. రోహిణీ కార్తె

కొరవ 10 పేజీలో

# హృదయపూర్వక అభినందనలు

యువకుడు – ఉత్సాహవంతుడు

కార్యదీక్షాపరుడు – నిరంతర శ్రమజీవి

మన నెల్లూరు వాడైనా మద్రాసులో తమిళనాడు తెలుగు యువశక్తి

అధ్యక్షుడు, ఆంధ్ర సోషల్ & కల్చరల్ అసోసియేషన్ కన్వీనర్

## శ్రీ కేతిరెడ్డి జగదీశ్వర రెడ్డి గారిని

కేంద్ర సమాచార శాఖ ఫిలిం సెన్సార్ బోర్డు సభ్యునిగా నియమితులైన శుభసందర్భంలో వారింకా ఎంతో ఉన్నత స్థితిని పొందాలని ఆకాంక్షిస్తూ, మా హృదయపూర్వక అభినందనలు అందజేస్తున్నాము.



భారతప్రధాని, కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ పి.వి. నరసింహారావు గారితో కేతిరెడ్డి జగదీశ్వర రెడ్డి

**కళాంజలి శారీస్**
షాప్ నెం 10, వైరమ్స్ కాంప్లెక్స్ టి.నగర్ – మద్రాసు - 600 017.

**రాజశేఖర రెడ్డి**
ప్రొ.. హోటల్ మయూర, బెంగుళూరు

### యువజన కాంగ్రెస్ కార్యకర్తలు

వేమిరెడ్డి శ్రీనివాసుల రెడ్డి
సి. హెచ్. కరుణాకర్
సురేష్ పీటర్
వెంకటేశ్వర్లు
నవకుమార్ (చార్లి)
ఎస్.సుభాషిణి
పవన్
పార్వతి

శ్రీనివాసులు
రమేష్
ఎ. కల్పన
ఎ. పద్మ
వి. రఘునాథరెడ్డి
సుధీర్ బాబు
భారతి
వాణి

శ్రీలత
సరస్వతి
ఉష
హిమబిందు
ఎ. కిషోర్ బాబు
మల్లిక
సుధాకర రావు
పి. శివకుమార్

## [illegible]

### ప్రజాగవర్నరు

త్రిపురగవర్నరైన నెల్లూరీయుడు శ్రీ కె.వి. రఘునాథ రెడ్డి చాలకాలం తర్వాత 6 తేది నెల్లూరు వచ్చి 8 తేది మద్రాసు వెళ్లారు. ఆయన తోటి ఆయన సతీమణి డాక్టర్ సరోజనమ్మగారు కూడా వచ్చారు.

రఘునాథ రెడ్డి గారి నెల్లూరు రాకకు కారణం ఆప్తులను కోల్పోయిన బంధువుల పరామర్శగా వున్నట్లున్నది. నెల్లూరులో తండ్రిని కోల్పోయిన శ్రీ వేజర్ల వెంకురెడ్డిని విచారించారు; సంగం, విరువూరులకు పోయి విచారింపులే కాక బంధువులను పలుకరించి వచ్చారు. ఆయన స్వగ్రామం; విరువూరు ఆమె స్వస్థలం సంగం. రఘునాథ రెడ్డి గారు సతీసమేతంగా సంగంలోని దేవాలయాల్ని తొంగిచూడారంటే మాకు ఆశ్చర్యం గానే వుంది. దేవుళ్లను, దేవతలను సేవించ కూడదని కాదు. ఆయనలో కూడా ఆ మూఢాభిప్రాయాలున్నాయా అనేది మా సంశయం.

నెల్లూరులో శ్రీ రఘునాథరెడ్డి సంవత్సరం క్రితం సతిని కోల్పోయిన నలమోలు గోపాలకృష్ణయ్య ఇంటికి పోయి, ఆయన్ను పరామర్శించారు. 7 తేది ఉదయం ఆనం సంజీవ రెడ్డి బ్రేక్ ఫాస్టు, పైటాల మెగొరె టీ, రాత్రి ఎల్.వి. కృష్ణారెడ్డి గారి విందు సేవించారు. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారిని గౌరవపురస్కారంగా వారి ఇంటికి పోయి కలుసుకున్నారు. గోపాలరెడ్డి గారు శ్రీమతి లక్ష్మి కాంతమ్మ సమేతంగా వెళ్లి రఘునాథరెడ్డి దంపతులను గెస్ట్‌హౌస్‌లో మర్యాద పూర్వకంగా కలుసుకొని వచ్చారు.

రఘునాథరెడ్డి గారికి బహిరంగ కార్యక్రమాలేమీ లేవు; వారు వస్తున్నారని ముందుగా తెలియను కూడా తెలియదు.

రఘునాథ రెడ్డి గారు ఏ పదవిలో వున్నా అతి నిరాడంబరంగా వుంటారు. కేంద్రమంత్రి గా 1976 లో కాబోలు నెల్లూరు వస్తే మామూలు దట్టి, అద్దరు దూరేంత వదులుగా వున్న ఖద్దరు తిరిగారు. మొన్న గవర్నరుగా వచ్చినా అదే నిరాడంబరత. బయటతిరిగి నపుడు మాత్రం సాదా పరాయి కోటు వేసుకున్నారు. ఆయన వేషంలో, మాటలలో, వర్తనలో భేషజం కించిత్ తేడా కూడా లేదు. ఆ మామూలు పాత రఘునాథరెడ్డి గారే! గవర్నరంటే దాలు దవాళ్ళు ధరించిన సిబ్బంది. అడుగులకు మడుగులొత్తే పరివారం, హడావిడి ఎంతగానో వుంటుంది. కాని మొన్న ఆయన బసచేసిన గెస్టుహౌస్ చూస్తే, అక్కడ ఎవ్వరూ లేనంత ప్రశాంతంగా వుణ్ణింది; కార్లుగాని, జనంగాని వుంటే వొట్టు! అందుకే రఘునాథరెడ్డి గారిని ప్రజా గవర్నరు అంటున్నాము.

రఘునాథరెడ్డి గారు దీర్ఘకాలం రాజకీయ అజ్ఞాతంలో వుండి, వి.పి.సింగ్ ప్రధానిత్వపు జనతా ప్రభుత్వంలో త్రిపుర గవర్నరుగా నియమింపబడి కొనసాగు తున్నారు.

### మాగుంట కాలేజిలు

మాగుంట సుబ్బరామరెడ్డి గారు తన నియోజకవర్గ పరిధిలో ఈ ఏడాది 12 జూనియర్ కాలేజిలు ప్రారంభించాలని ప్రయత్నిస్తున్నారు. నెల్లూరు జిల్లాలో కావలి, కలిగిరి, సీతా సీతారామపురం; ప్రకాశం జిల్లాలో ఈతముక్కల, కనిగిరి, కందుకూరు, సిఎస్‌పురం, సంతనూతలపాడు, కురిచేడు, చినగంజాం, జె. పంగులూరు గ్రామాలు పరిశీలనలో వున్నాయి. ఒక్కొక్క కాలేజికి అరున్నర లక్షల కార్పస్ ఫండ్ చెల్లించాలి; భూమి, భవనాలు సమకూర్చుకోవాలి. వీటన్నింటికి కోటిన్నర ఖర్చువుతుంది. అదిగాక, ఏడాదికి కాలేజికి ఏడులక్షల లెక్కన దాదాపు కోటి రూపాయల నిర్వహణ వ్యయం వుంటుంది. ప్రతి కాలేజిలో సైన్సు, ఆర్ట్సు, కామర్స్ కోర్సులుంటాయట. నిబంధనల ప్రకారమే గాక, పిల్లలకు నిజంగా చదువు చెప్పే ఉద్దేశ్యంతో నెలకొల్పుతున్న కాలేజిలు కాబట్టి, 13 మంది లెక్చరర్లను పూర్తి మెరిట్ పద్ధతిన నియమిస్తున్నారు.

ఇవిగాక ప్రభుత్వం అవకాశం ఇస్తే ఒంగోలులో మెడికల్, ఇంజనీరింగ్ కళాశాలలు నెలకొల్పే ప్రతిపాదన పరిశీలనలో వుంది. ఒంగోలుకు 15 కిలోమీటర్ల దూరంలో ఒక కొండక్రింద, అద్భుతమైన ప్రకృతి అందాలు ఉట్టిపడే ప్రదేశంలో ఇందుకోసం 80 ఎకరాలు సేకరించారు.

సుబ్బరామరెడ్డి గారి చేతికి ఎముకలేదని అంటారు గాని, కండ అయినా వుందా అన్న అనుమానం కల్గుతున్నది. ఎన్నికల్లో ఏదో ఆవేశంలో చేసిన వాగ్దానాన్ని గుర్తు పెట్టుకొని, ఇన్ని కోట్ల ఖర్చుతో విద్యాసంస్థలు స్థాపించి, నెలకొల్పడం సాధారణ విషయమా? రాజకీయాలలోకి వచ్చిన రోజు నుంచి ఎన్ని రూపాల ఆర్జన వుందో చూసే నాయకులున్న ఈ రోజుల్లో, రాజకీయాల కోసం కోట్లను మంచి నీళ్లప్రాయంగా ఖర్చుపెట్టడం సుబ్బరామరెడ్డి వ్యక్తిత్వ వైశిష్ట్యాన్ని సూచిస్తుంది. ఈ విద్యాదానం, ఆయనచేసే అసంఖ్యాక దానపరంపరలన్నింటిలోకి ప్రశస్తమైనదిగా, సార్థకమైనదిగా నిల్చిపోవాలని ఆకాంక్షిస్తున్నాము.

### పెళ్లకూరుకు బైపాస్

శ్రీ పెళ్లకూరు రామచంద్రారెడ్డికి 7 తేది మద్రాసు అపోలో ఆస్పత్రిలో బైపాస్ ఆపరేషన్ జరిగింది. బాగుంది; ఒకటి రెండు రోజుల్లో ఆస్పత్రి నుండి ఇంటికి పోవచ్చు.

ఆయనకు సందర్శన అభిమానుల సంఖ్య ఎక్కువ; వారు ఆయన్ను చూడాలి. ఆయనకూ వారితో మాట్లాడే కాలక్షేపం కావాలి. నెల రోజుల పాటు అది పరిమితమైతే, మళ్లీ పూర్వ ఆరోగ్యంతో చెంగు చెంగున ఎగురుతూ వుత్సాహంగా మన మధ్యకు వస్తారు.

### ధర్మారెడ్డి ఇంటి దోపిడి

నెల్లూరు మునిసిపాలిటీలో మేనేజరుగా, తర్వాత ఒంగోలు వగైరా చోట్ల కమీషనర్‌గా పనిజేసి, విజయవాడ కార్పొరేషన్ డిప్యూటీ కమీషనర్‌గా రిటైరై నెల్లూరులోనే వుంటున్న శ్రీ ఎం. ధర్మారెడ్డి ఇల్లు 8 తేది పట్టపగలు దోపిడీకి గురయ్యింది.

ఆయన మునిసిపల్ ఆఫీసు ఎదురుగా వున్న వీధిలో కాపుర ముంటున్నారు. ఆ రోజు వుదయం 8 గంటల సమయంలో ఆయన నిద్ర పోతున్నపుడు నలుగురు ఆగంతుకులు వచ్చి, అందులో ఒకరు ధర్మారెడ్డి ఏడుకొని వున్న రూమును దాటుకొని అవతల గదిలోకి పోయి సత్యవతి అనే ఆమెతో రెడ్డి గారితో మాట్లాడాలన్నారట. ఆయన గాఢ నిద్రలో వున్నాడని ఆమె చెప్తుండగా ఆ అలజడికి ధర్మారెడ్డి మేలుకొని ఏమని అడిగాడట. తాము ఏదో ఇంటి విషయం మాట్లాడాలన్నారట. పదకొండుగంటలకు రమ్మన్నాడట. ఈ సారి ఐదు మందిగా వచ్చారట; ఇంట్లో ఆయన తప్ప ఇంకెవరూ లేరట. వచ్చిన వారిలో ఒకరు మంచి నీళ్లు అడిగాడట; తెచ్చివ్వగా మరొకరు కూడా అడిగారట; జగ్గుతో తేవడానికి వెనుదిరిగాడట. అంతే; బయట తలుపు గడియ పెట్టి, అరిస్తే చంపేస్తామని కత్తులు చూపారట; చేతులు వెనక్కు విరగకట్టి, మంచం మీద త్రోసివేసి, బీరువా తాళం అడిగారట; ఛాతీ మీద బలంగా కొట్టారట; నిరోధ ప్రయత్నంలో చేతికి స్వల్పంగా కత్తిగాయమైనట్లుంది. ఎట్లనో తాళాలి చ్చినట్లున్నాడు; బీరువా తీసి 40 సవర్ల బంగారు నగలు, నాలుగువేలు నగదు తీసుకున్నారట. రెండవ బీరువా తాళం అడిగితే తన వద్ద లేవన్నాడట; దానిని బలవంతంగా తెరవడానికి విఫల యత్నం చేశారట; బీరువా హేండిల్ విరిగిందట గాని, తలుపులు రాలేదు. వారు అతని ముక్కు వద్ద ఈథర్ ముంచి దూది కాబోలు పెట్టారట? గాలి పీల్చకుండా వుంచ గలిగినంత సేపు ఉంచి వుండలేని పరిస్థితి వచ్చినపుడు వారిని కాలితో ఎగసి తన్నాడట. ఇంతలోగా సరస్వతి అనే టీచరు వచ్చి తలుపు తట్టడం, వారు ఆమె గొంతు పట్టుకోవటం జరిగిందట. ఇంతలోగా తాను సందులోకి పోయి దొంగలని అరచాడట; దానితో వారు పారిపోయారట, ఆమె కూడా వచ్చి అరచిందట- ఇది ధర్మారెడ్డి గారి కథనం.

వచ్చిన దొంగలు ఐదుగురూ మంచి ప్యాంట్లు షర్టులు, టక్‌చేసి, షూస్‌తో టిప్‌టాప్‌గా వుండినారట. వారిలో ఒకరిని ఎక్కడో ఎప్పుడో చూచినట్లు గుర్తు అంటారు ధర్మారెడ్డి. వారు దొంగతనం వృత్తిగా గలిగిన వారుగా కనపడలేదంటారు. మూడవ స్టేషన్ ఎస్.ఐ. మొదలు, ఎస్.పి. గారి వరకు నేరస్థలాన్ని సందర్శించారు; వివరాలు తెలిసికొని, రెండవ బీరువాలోని ముఖ్యమైన పత్రాలు తీసుకపోయారట.

పట్టపగలు దోపిడి సొత్తు కోసమా, మరే ఇతర కారణం వల్లనా? ఉదయం నేరుగా దురుసుగా వచ్చి ఇంట్లోకిపోయి ఆడ వాళ్లను ఆబద్ధంగా అడిగినప్పుడు, ధర్మారెడ్డికి ఎందుకు అనుమానం కలుగలేదు? ఇంట్లో ఎవ్వరూ లేని సమయంలో తలుపు తీసి దోపిడీకి ఎందుకు అవకాశమిచ్చారు? టి.వి.లో 11 గంటల సమయంలో మామూలుగా కార్యక్రమాలు లేనప్పుడు సత్యవతి ఆఫీసుకు పోయి వుండేది తెలిసి సరస్వతి అక్కడికెందుకు వచ్చింది?

7వ పేజీలో



[illegible] తేది రామినాయుడు జయంతి సభలో ఉదయం దినపత్రిక సంపాదకుడు గజ్జల [illegible]రెడ్డికి అవార్డు అందజేస్తున్న జమీన్‌రైతు మేనేజింగ్ ఎడిటర్ నెల్లూరు [illegible]రామమూర్తి, దినసి అధ్యక్షుడు ఆనం సంజీవరెడ్డి, సంపాదకుడు నెల్లూరు శైలేంద్రప్రసాద్

### డాక్టర్ రఘురామిరెడ్డి మరణం

నెల్లూరులో సీనియర్ కంటి డాక్టరు, లయన్ పి. రఘురామిరెడ్డి 11 తేది రాత్రి గుండెపోటుతో హఠాత్తుగా మరణించారు. ఆయన వయస్సు 58 సంవత్సరాలు. ఆయనకు ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె వున్నారు. ఒక కుమారుడు ఇంజనీరింగు పట్టభద్రుడు; ఇంకొక కొడుకు దావణగిరిలో మెడిసిన్ పి.జి. కోర్సు చదువుతున్నారు - కుమార్తె డాక్టరు; భర్త తోటి అమెరికాలో వుంది.

డాక్టర్ రఘురామిరెడ్డి 'జ్యోతి' పేరుతో పెద్ద నర్సింగ్ హోం కట్టారు; అది పూర్తిగా వినియోగానికి రాకముందే ఆయన పోయారు. అర్ధాంతరంగా ఆరిపోయిన రఘురామిరెడ్డి గారి జీవన జ్యోతి 'జ్యోతి' రూపంలో చిరకాలం ప్రకాశించాలి.

రఘురామిరెడ్డి కుటుంబానికి మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

## నెల్లూరు ముచ్చట్లు

5 పేజీ కొరవ

పోలీస్ రెండవ దిగువా తీయించి అందులో ముఖ్యమైన పత్రాలను ఎందుకు తీసుకుపోవలసి వచ్చింది? — అటు వంటి సందేహాలు, అనుమానాలు అనేకం వ్యక్తం చేయబడుతున్నాయి.

తనకు గిట్టని వారు చేయించి వుంటారని, వారు పోలీస్ అధికార్ల పరిచయం గలవారని ధర్మారెడ్డి అనుమానం. దోపిడికి సంబంధించి ధర్మారెడ్డి కథనం పట్ల పోలీసుకు పూర్తి నమ్మకం వున్నట్లు లేదు. ముఖ్యంగా దోపిడీ చేయబడ్డ నగల విషయంలో నమ్మకం లేదు. దర్యాప్తుకు దోహదకరంగా వుంటాయని, దోపిడి తో సంబంధం లేని పత్రాలను పోలీసు తీసుక పోవలసిన అవసరం ఏమి కలిగిందనే ప్రశ్న పురయిస్తున్నది. అతనిని కష్టాల పాల్జేయడానికి పుట్టేంచారేమో ననే ఆరోపణ కలిగిస్తున్నది. మొత్తానికి పట్టపగలు ధర్మారెడ్డి ఇంటి దోపిడి వార్త టవున్‌ను హడలెత్తించింది. పగలు కూడా భద్రతలేదనే భీతావహం ప్రజల్లో కనపడుతుంది. నెల్లూరు పోలీస్ చిత్తశుద్ధిని, నిజాయితీని శంకించవలసిన అవసరం లేదు గాని; ఈ విషయంలో వారు నిష్పాక్షికంగా చురుగ్గా దర్యాప్తు జరిపి దోషులను పట్టుకొని నిజాన్ని నిగ్గుతేల్చాలి!

### మరొకటి

9 తేది రాత్రి నెల్లూరు వెంకటరమణ థియేటర్ వెనుక కాపురమున్న నెల్లూరు మస్తానమ్మ ఇంట్లో పది సవర్ల బంగారు నగలు, రూ 5200/- లు డబ్బు దోపిడి చేసుకపోయారు. బయటపడుకొని వుండిన పశులకాపరిని మూటకట్టి, టి.బి. హాస్పిటల్ కాంపౌండ్‌లోపల విసిరేశారట. ట్రాక్టర్ డ్రైవర్లలో ఒకరిని బయటగదిలో బంధించారు; ఇంకొకరిని కదలకుండా కట్టివేసి, అరవకుండా ప్లాస్టర్ వేసి, వచ్చిన పని చక్క పెట్టుకొని పోయారట.

ఇక్కడ విశేషం అది కాదు — చెల్లెలు ఇంట జరిగిన ఘంగతనాన్ని గూర్చి విచారించడానికి వచ్చిన అక్క దర్యాప్తుకు వచ్చిన పోలీస్ అధికార్లనడిగిందట — ఇది వరకు రాత్రి పూట పోలీస్ వీధుల్లో పెట్రోలింగ్ తిరిగేవారు, ఇప్పుడు రావడం లేదేమి అని నిర్మొగమోటంగా అడిగిందట అమ్మా, ఆ వీధుల్లో కానుగ చెట్లు దట్టంగా వున్నాయి, రాత్రిపూట అక్కడికి రావాలంటే మా వాళ్లు భయ పడుతున్నారు; చెట్లనైనా కొట్టించి వేయండి అని జవాబట. సిగ్గు, సిగ్గు!

### పాపం గిరిజన మహిళ

ఈ మధ్య దొంగల ముఠా ఒకటి కోవూరులో స్వైర విహారం చేసింది. అందులో ఒక దయనీయ సంఘటన పడుకొని వుండిన ఒక యానాది జంటలో భర్తను కట్టివేసి, భార్యను మానభంగం చేసి, ఐదురుపాయలు దొంగిలించుకొని పోయారట! ఆ అభాగ్యురాలికి ఏమైనా సాయం జరిగిందా?

### ఎల్‌ఐసి డివిజనల్ ఆఫీసు

నెల్లూరులో లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ డివిజనల్ కార్యాలయం ప్రారంభించనున్నారు. నెల్లూరు, చిత్తూరు, ప్రకాశం జిల్లాలకు చెందిన బ్రాంచిలు దీని క్రిందకు వస్తాయి. ఇప్పటి వరకు కడప డివిజన్ క్రింద వుండేవివి.

### సుమంత్ ఇంజనీరింగ్ ప్రారంభం

నెల్లూరు ఆటోనగర్ దగ్గర ఇండస్ట్రియల్ ఎస్టేట్‌లో నూతనంగా నెలకొల్పిన సుమంత్ ఇంజనీరింగ్ పరిశ్రమను ఎమ్పీ శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి 10 తేది ఉదయం ప్రారంభించారు. వాణిజ్య పన్నుల మంత్రి శ్రీ కె. బాపిరాజు, ఎమ్మెల్యే శ్రీ జె కె రెడ్డి, కళ్యాణ్ ఫిలింస్ ప్రసన్న కుమార రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

వ్యవసాయ మోటర్లు తయారు చేసే పరిశ్రమ ఇది. శ్రీ ఎ ప్రశాంత కుమార రెడ్డి దీని నిర్వాహకుడు. ఆయనకు మా విజయాకాంక్షలు.

### సణుగుడు

4 పేజీ కొరవ

అందుకు కాక పోయినా బ్యాంకులు తమ తాత సొత్తయినట్లు ఫీలౌతూ, అప్పులివ్వమంటే తమ జేబులోని ముల్లె ఇచ్చినట్లు బాధపడుతూ,పరిశ్రమలు పెట్టాలని వెళ్ళే యువకులను ప్రోత్సహించాలి పెట్టె బ్యాంకులకు బుద్ధిచెప్పి వందుకైనా మెహతాకు జై కొట్టాలి!



జయంతి సభలో ప్రార్థన గీతమాలపిస్తున్న కుమారి కళ్యాణి; ఉపన్యసిస్తున్న రాపిపాటి మహానంద.



గట్టిల మల్లారెడ్డితో నెల్లూరు శ్రీరామమూర్తి



రామానాయుడు గారి పటానికి అభిమాన పూర్వకంగా పూలమాల వేస్తున్న జె. కోలారెడ్డి

### పి.వి.

(మొదటి పేజీ కొరవ)

తెలుగుదేశం వంటి ఇతర పార్టీలు వారితో చేతులు కల్పడం ఖాయం. రాష్ట్ర ఎన్నికల కమీషనర్ శ్రీ కమలనాథ్‌పై దాడికి తలపడడం ద్వారానే టిజెపి తన ఆగ్రహం ఏ తీరులో వుండబోతుందో రుచి చూపించింది.

ఇంకొక ప్రక్క ముఖ్యమంత్రికి ఈ సమస్య పెద్ద శిరోభారమైంది. ప్రధాని స్వయంగా జోక్యం చేసుకుంటున్నాడని తెలియడంతో అసమ్మతి వాదులు పెట్రేగిపోతున్నారు. నిందనంతటినీ ఆయనపై త్రోసి, పెద్ద రభస సృష్టిస్తున్నారు.

రిపోలింగుకు ఉత్తర్వు తెప్పించడం ద్వారా ప్రధాని శ్రీ పివి నరసింహారావు ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా వున్నాడని నిరూపించి, శాసన సభ్యుల మద్దతు కూడగట్టుకోవాలని అసమ్మతీయుల ప్రయత్నం. రిపోలింగు జరగదమంటే , అది ముఖ్యమంత్రికి రాజకీయంగా పెద్ద దెబ్బ.

ఈ వార్త వ్రాసే సమయానికి ఢిల్లీ నుంచి వచ్చిన ఎన్నికల కమీషన్ పరిశీలకులు తిరిగి ఢిల్లీ వెళ్ళిపోయారు. వారి నివేదికను బట్టి ఛీఫ్ ఎలక్షన్ కమీషనరు ఒక నిర్ణయం తీసుకోవాలి. అప్పటి వరకు అందుతున్న వార్తలను బట్టి పివి, రిపోలింగు సాధ్యాసాధ్యాలు పరిశీలించమని చెప్పారనే తెలుస్తోంది. అదే నిజమైతే మాత్రం ఆయన కొరివితో తల గోక్కున్నట్లు అవుతుంది. ప్రజాస్వామ్య పద్ధతులను భంగ పరిచాడన్న నిందను ఆయన ఎదుర్కొన వలసివస్తుంది. టిజెపి ఆగ్రహిస్తే ఆయన ప్రభుత్వానికి ప్రమాదమే. పివి అటువంటి పొరపాటు పని ఎప్పటికీ చేయడని పరిశీలకుల విశ్వాసం.

అసలు హిమయత్ నగర్‌లో రిపోలింగు జరిపించాల్సిన అవసరం వుందా? అంతటి స్థాయిలో రిగ్గింగు జరిగిందా? రిగ్గింగు జరిగివుంటే ఎవరు చేసి వుంటారని ప్రశ్నించుకుంటే - తగిన సమాధానాలు దొరకడం లేదు.

# తాటాకులిళ్లకు పరిహారం ఇవ్వడానికి తటపటాయింపా?

తెలుగుగంగ పథకంలో మునకకు గురయ్యే భూములకు తగిన నష్ట పరిహారం ఇవ్వడంలో ప్రాజెక్ట్ అధికార్లు రైతులకు అన్యాయం చేస్తున్నారని ఎ.పి. స్టేట్ కి. కి. ఎస్. వి. ఎస్. ఎల. నాయుడు ఆరోపిస్తున్నారు. మొన్న 4 తేదీ ఆయన ఈ విషయమై ముఖ్యమంత్రికి ఒక వినతి పత్రం కూడా ఇచ్చారు. గ్రామాలలోని తాటాకు పూరి పాకలకు, అవి శిథిలావస్థలో వున్నాయన్న కారణంగా పరిహారం ఇవ్వడం లేదట. పూరిపాకలు పడిపోయేట్లు వుండడం పేదరికానికి చిహ్నమే గాని, పరిహార యోగ్యం కావన్న అభిప్రాయం తప్పని నాయుడు గారు నివేదించారు. నిమ్మ పట్టాభూములను, వాటిలో బలహీన వర్గాల వారు పెట్టిన ఖర్చును అధికారులు లెక్కలోకి తీసుకోవడం లేదని; బావుల విషయంలో ఒకే స్లాబ్ రేటు పాటించడం అన్యాయమని నాయుడు గారు ఆరోపిస్తున్నారు. దానిమ్మ చెట్లకు ఎకరాకు 45 వేలు ఇవ్వాలని తీసుకున్న నిర్ణయం

### జిల్లా వార్తలు

అమలు కాక పోవడమే గాక — చెట్ల వయసును నిర్ధారించడంలో పంటకోతల శాఖ శాస్త్రీయ విధాన మవలంబించ వడం లేదన్నది కూడా ఆయన ఫిర్యాదులలో ప్రధానమైనవి.

దానిమ్మ చెట్ల విషయంలో, ఆ తోపుకి కనిపెట్టిన వ్యాపారులు లక్షలు ఆర్జించి, ఆనందంగా వున్నారు; వారిని చూసి ఆశపడిన రైతుల పరిస్థితి పులిని చూసి వాత పెట్టుకున్నట్లయింది. ఆస్తులు తాకట్టుపెట్టి, నగలు తెగనమ్మి చెట్లు పెంచితే వారికి పెట్టిన ఖర్చు కూడా గిట్టుబాటు కావడం లేదు; వారి పట్ల ముఖ్యమంత్రి సానుభూతి చూపడం ధర్మం.

తాటాకు ఇళ్లకు పరిహార మివ్వమనడం — గుమ్మడికాయలు దూరే సందులు వదిలిపెట్టి, ఆవగింజల దారిని కత్తిరిన మూసినట్లుంగిరి. తెలుగుగంగ ప్రాజెక్టులో దొంగ క్లెయిమ్‌లతో కాంట్రాక్టర్లు, లబాలబా సంపన్నులు కొట్లు కొల్లగొట్టి పోతుంటే కళ్లు మూసుకొని కూర్చుని, లెక్కలు వేయడం వల్ల ఖజానాకు మేలు చేసినట్లవుతుందా? ఎన్ని తాటాకులిళ్లకు పరిహారమిస్తే — ఒక కంట్రాక్టరు తిన్న క్లెయిమ్‌కు సరిపోతుంది?

ప్రాజెక్ట్ కోసం తమ ఇళ్లను ఆస్తినీ త్యాగం చేస్తున్న రైతుల పట్ల, పేదల పట్ల అధికారులు సానుభూతి చూపి, వారికివ్వాల్సిన పరిహారాన్ని ఉదారంగా ఇవ్వడం ధర్మం. నాయుడు గారి నివేదనను ముఖ్యమంత్రి పరిశీలించగలరని ఆశిస్తాము.

## ముసునూరు దేవాలయం ఫిర్యాదు

కావలి మండలం, ముసునూరు గ్రామంలో భక్తుల చందాలతో నిర్మితమైన పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి దేవాలయం ధర్మకర్త, ఆలయ ఆదాయాన్ని స్వంతానికి వాడుకుంటున్నారని 10 మంది గ్రామస్తులు ఫిర్యాదు చేస్తున్నారు. శాశ్వత పూజల పేరుతో డబ్బు వసూలు చేసి, లెక్కల్లో చూపించలేదని, క్రాంతిపథం క్రింద కట్టిన గదులు స్వంతానికి వాడుకొంటున్నారని ఆరోపణ.

బ్రహ్మంగారు, తన భవిష్య పురాణంలో, ఇటువంటి ధర్మకర్తల విషయం వ్రాశారా? వ్రాయకుంటే అప్పుడు బ్రతికొచ్చి స్వీయానుభవాల క్రింద వ్రాసుకొంటాడేమో. పాపం!

## వెంకటగిరి వీధి దీపాలు

వెంకటగిరి టౌన్‌లో ఏ వీధిలోనూ వీధి దీపాలువెలగడం లేదని శ్రీ ఎ. రాజశేఖర రాజా వ్రాస్తున్నారు. చీకట్లో దొంగలు విచ్చల విడిగా తిరుగుతున్నారట. పంచాయితీ ప్రభువులు చిత్తగించాలి.

## చెన్నూరు శిశువైద్యం

గూడూరు మండలం చెన్నూరులో 31 తేది మిత్రమండలి ఆధ్వర్యాన శిశువైద్య శిబిరం జరిగింది. గూడూరు ఆస్పత్రి డాక్టరు శ్రీ బి. రోహిణి నాథ్ పరీక్షలు జరిపి మందులు, టానిక్కులు ఉచితంగా ఇచ్చారు. గూడూరు డెంటిస్ట్ డాక్టర్ ఎం. మధుసూదన రావు శిబిరం ప్రారంభించారు.

## జువాలజీలో డాక్టరేట్

నెల్లూరుకు చెందిన కుమారి దాశెట్టి శైలజ, శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం నుంచి జువాలజీలో డాక్టరేట్ స్వీకరించారు. 'ఇంపాక్ట్ ఆఫ్ ఎన్విరాన్ మెంటల్ ఫ్యాక్టర్స్ ఆన్ ది మెటబాలిజం అండ్ ఫిజియాలాజికల్ ఫంక్షన్స్ ఆఫ్ ది బ్లడ్ ఆఫ్ ది ఫ్రెష్ వాటర్ ఫీల్డ్ క్రాబ్' అనే అంశం పై ఆమె చేసిన పరిశోధనకు విశ్వ విద్యాలయం డాక్టరేట్ ప్రదానం చేసింది.

కుమారి శైలజ నెల్లూరీయు రాలు; రిటైర్డ్ ఎసిటిఒ శ్రీ డి. రఘురామయ్య కుమార్తె, రంగనాయకుల పేట మునిసిపల్ హై స్కూలు, వి ఆర్ కాలేజిలలో చదివింది. డాక్టరేట్ తర్వాత ఆమె, ఉన్నత విద్యా భ్యాసానికై అమెరికాలోని సెంట్ టాయిస్ రాష్ట్రం క్రిస్టెన్టిల్లికి వెళ్లారు. ఆమె భర్త, శ్రీ జి. చంద్రశేఖర్ కూడా పిహెచ్‌డి పట్టాపొందిన డాక్టరే. బయోకెమిస్ట్రీలో పిహెచ్‌డి చేసి, అమెరికాలోనే ఉద్యోగం చేస్తున్నారు.

* * *

వృక్ష శాస్త్రంలో మరొక నెల్లూరు యువతి, శ్రీ మతి ఆదిపూడి అమృత వల్లి డాక్టరేట్ పొందారు. మొక్కల ప్రధాన జీవన ప్రక్రియ అయిన కిరణ జన్య సంయోగ క్రియ పై 'ఐసోలేషన్ స్ట్రక్చర్ అండ్ ఫంక్షనల్ క్యారెక్టరైజేషన్ ఆఫ్ క్లోరోఫిల్ ప్రోటీన్ కాంప్లెక్సస్ ఆఫ్ ఫోటో సిస్టం ఫ్రమ్ సోర్గం బై కొలార్ డిఫరింగ్ అండర్ లో ఇర్రేడియన్స్ గ్రోత్ కండిషన్స్' అనే అంశంపై ఆమె చేసిన పరిశోధనకు వెంకటేశ్వర విశ్వవిద్యాలయం డాక్టరేట్ బహూకరించింది. తక్కువ కాంతిలో మొక్కలలోని హరిత రేణువుల పై జరిగే మార్పుల గురించి పరిశోధన చేయడం వల్ల, ఫలసాయం పెంచుకొనేందుకు తీసుకోవలసిన చర్యలపై అవగాహన ఏర్పడుతుంది. శ్రీవెంకటేశ్వర విశ్వ విద్యాలయంలో ఇటువంటి పరిశోధన జరగడం ఇదే ప్రథమమట.

## రాపూరు ట్యాంక్‌కు మోక్షం ఎప్పుడు?

రాపూరు పౌరుల దాహం తీర్చడానికి ఎనిమిదేళ్ల క్రితం ప్రారంభించిన రక్షిత నీటి పథకం ఇంకా నిర్మాణం లోనే వుంది. అప్పట్లో దీన్ని 8 లక్షల వ్యయంతో నిర్మించాలనుకున్నారు; అనాటి రెవిన్యూమంత్రి శ్రీ నల్లప రెడ్డి శ్రీనివాసులు రెడ్డి పునాది రాయివేశారు. కొంత దూరం పనిజరిగింది. ఆ తర్వాత కంట్రాక్టరు అదృశ్యమై పోయారు. మళ్లీ కన్పడలేదు. సగం కట్టిన ట్యాంకు మాత్రం టౌనమధ్యలో దిష్టిబొమ్మ వలె నిలబడి వుంది. పౌరులు ఎండిపోయిన బావుల్లో, వట్టిపోయిన బోరింగులలో నీళ్లకోసం దేవుళ్లాడుతున్నారు.

ఒక నీటి పథకం నిర్మాణం చేయడానికి ఎనిమిదేళ్లు కూడా చాల లేదంటే — ఆ ఇంజనీరింగ్ శాఖను ఏమి చేయాలి? గిన్నిస్ బుక్ లో పేరు వ్రాయించాలా లేక ఎండిన బావుల్లోని నీరు త్రాగించి బుద్ధి చెప్పాలా?

1991 పార్లమెంట్ ఎన్నికలప్పుడు ఈ రక్షిత నీటి పథకం ప్రస్తావన వచ్చింది. ఉభయ అభ్యర్థులూ హామీలు కురిపించారు. కుమారి పద్మశ్రీ తోటి వచ్చిన శ్రీ రావుల అంకయ్య గౌడ్ మరి కొంచెం స్పీడుగా పోయి పద్మశ్రీని గెల్పిస్తే నీటిపథకం పూర్తి చేయడానికి 60 వేలు విరాళం ఇస్తానని మాట ఇచ్చేశాడు. ఎన్నికలు జరిగాయి; పద్మశ్రీ గెల్చింది; అంకయ్య గౌడ్ ఆ మాట మాత్రం ఆ మాట మరిచి పోయాడు; మరచి పోయినట్లు నటిస్తున్నాడేమో తెలియదు. ఆ హామీలు హామీలుగానే వున్నాయి,నీటి పథకం మాత్రం దిక్కు లేకుండా పడి వుంది.

గౌడ్ గారూ, చెప్పిన మాట నిలబెట్టుకోవడం బాగుంటుందేమో! లేకుంటే వచ్చే ఎన్నికల్లో రాపూరులో మీకు ఒక్క ఓటూ పడదు.

## మోమిడి ఫోన్లు మూగపోయాయి

చిల్లకూరు మండలం మోమిడి ఎక్స్ఛేంజి ఫోన్లు 3 నెలల నుంచి పనిచేయడం లేదని వరగలి నుంచి శ్రీ కె. సనత్‌కుమార్ రెడ్డి వ్రాస్తున్నారు. ఎప్పుడు ఫోన్ ఎత్తినా డయల్ టోన్ రావడం లేదట. అప్పుడప్పుడు వింత శబ్దాలు వస్తుంటాయట.

లైన్ మ్యాన్ ఎప్పుడూ లైన్ మీద తిరుగుతున్నట్లే వుంటాడు. కాని, ఫోన్లు మాత్రం పనిచేయడం లేదన్నది ఆ యువకుడి ఆవేదన; సముద్రపు గాలికి వైర్లు తుప్పుపట్టి తెగిపోతూండడం ఈ అబందరకు ఒక కారణం కావచ్చు. ఎన్నిసార్లు అతుకువేసినా, మళ్లీ తెగిపోవడం మామూలైనట్లుంది.

డిఇటి గారూ — మోమిడి సంగతి మీకు తెలిసినట్లు లేదు. ముఖ్యమంత్రి గారి అంతరంగిక అనుచర ముఖ్యుడి రాజ్యం. అక్కడ ఫోన్ పనిచేయకుంటే, ఎంత కష్టమో మీకు అర్థం కాదు. తక్షణం ఆ తుప్పు తీగలు తొలగించి, ఫోన్లను పలికించండి!

## శివారెడ్డి పద్యాలు

### పుట్టు వ్యాధి

సినిమలంటె కవినిచిందులేసే వాణ్ణి
పరుగులెత్తె వాణ్ణే పడుతులేస్తు
తాతనైన యింక తలనొప్పి బేరమ్ము
వచ్చివచ్చి అన్ని వదులుకున్న!

మందుబెంద కాళ్ళు మాడిపోతున్నాయి
అన్నివదులు కున్న హాయిగున్న
పాలిటిక్సు యీణ్ణే పట్టి వేధిస్తుంది
పుట్టు వ్యాధి యింక పోనపోదు!

### ముఖ్యమంత్రి

ముఖ్యమంత్రి నిన్నే మొన్నే
నెల్లూరొస్తె
కాళ్ళుయీడ్చుకుంటు కదిలి పోయిన
పోలీసోడు కవిని పోనీల చూణ్ణీల
అదినుంచి యింతె అడిగెదెవరు?

### జె.వి.ఆర్ చలోక్తి

ఆశుకవుల మూత్రకోశాల్లో వుండేది
తప్పు తప్పు రాళ్ళు రప్పగాదు
ముందు వెనుక అణిముత్యాలు
రత్నాలు
ఏమి నీ చతురోక్తి జె.వి.రెడ్డి!

## పంచాంగము

శుక్రమౌఢ్యమి జరుగుచున్నది.

### జూన్ నెల తిథులు

జ్యేష్ఠ శుద్ధ
తే 13 శని త్రయోదశి ఉ.గ. 9.15 వ
తే 14 ఆది చతుర్థశి ఉ.గ. 9.05 వ
తే 15 సోమ పూర్ణిమ ఉ.గ. 9.30 వ

జ్యేష్ఠ –కృష్ణ తిథులు
తే 16 మంగళ పాడ్యమి ఉ.గ. 10.20వ
తే 17 బుధ విదియ ఉ.గ. 11.40 వ
తే 18 గురు తదియ ఉ.గ. 1.27 వ
తే 19 శుక్ర చతుర్థి ఉ.గ. 3.20వ

స్వయంపాకుల శ్రీనివాసులు

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 75.00
ఆరు నెలలకు రూ. 40.00

## ప్రజాధనంతో నిర్మించే చిత్రాలలో ప్రజలకు హాని చేసే సన్నివేశాలా?

ముఖ్యమంత్రి సూటిప్రశ్న?

# నిర్మాతల్లారా, ఏమి సమాధానమిస్తారు?

డి. రామానాయుడు హైదరాబాద్‌లో ఫైవ్ స్టార్ వసతులతో నిర్మించిన రామానాయుడు స్టూడియోస్ ఫ్లోర్‌ను ప్రారంభోత్సవం చేసిన ముఖ్యమంత్రి శ్రీనేదురుమల్లి జనార్దన రెడ్డి " విరుడు 128 చిత్రాలు మన రాష్ట్రంలో తయారయ్యాయి. వీటిలో ఎన్ని సినిమాల వల్ల సమాజానికి మేలు జరుగుతోంది? కొన్ని సన్నివేశాలతో సమాజానికి ఎంత కీడు చేస్తున్నాయి. ప్రజల డబ్బుతో ప్రజలకు అపకారం చేసే చిత్రాలు నిర్మించడమా ? " ప్రజలకు చేటు చేసే, చిత్రాలకు సబ్సిడీ ఎందుకివ్వాలి; సాంఘిక ప్రయోజనం గల చిత్రాలకే సబ్సిడీ ఇవ్వాలనే ఆలోచనలో ఉన్నాం. " అన్నారు. ఇదే విషయాన్ని ఆ తర్వాత మరి రెండు సందర్భాలలోనూ ఆయన స్పష్టం చేశారు. ఈ విషయాన్ని నిర్మాతలు దృష్టిలో ఉంచుకోవాలి.

రాయితీలు ప్రకటించిన తర్వాత మన రాష్ట్రంలో చిత్రాల షూటింగులు పెరిగాయని అనేక మంది తమ హర్షాన్ని తెలిపారు. 128 చిత్రాలకు ఇచ్చిన రాయితీల వల్ల ప్రభుత్వానికి దాదాపు 25 కోట్లు వ్యయమైంది. ఇది ప్రజాధనం. ఆ ధనంతో ప్రజలకు ఉపకరించే చిత్రాలు ఎన్ని తయారయ్యాయో దర్శక నిర్మాతలు ఆలోచించాలి. మే చివరి వారం నుంచి విడుదలైన ఎన్ని చిత్రాలు విజయవంతమయ్యాయి? ప్రజలు చూడని చిత్రాలు తీయడ మెందుకు?

ఎం.ఎస్.రెడ్డి, వి. మాల కొండారెడ్డి, సుంకు బలరాం, సుంకర కనకారావు, పి.ఎస్.ఆర్. ఆంజనేయ శాస్త్రి, కె. నాగభూషణం ప్రభృతులు 30మందిని సభ్యులుగా సెన్సార్ బోర్డ్ నియమించింది. ఈ 'ఏర్‌బన్' పానెల్ మూలంగా మన చిత్రాల నాణ్యత ఎంతగా పెరుగుతుందో చూడాలి.

### టైటిల్స్‌లో తికమకలు

కొన్ని చిత్రాల పేర్లు ప్రేక్షకులకు ఒక పట్టాన గుర్తుండడం లేదు. " కలెక్టర్ గారి అల్లుడు" అని ఒక నిర్మాత పేరిడితే . మరొకరు "ప్రెసిడెంట్ గారి పెళ్ళాం" అని బారసాల చేశారు తమ చిత్రానికి! కిరణ్మయి ప్రొడక్షన్స్" ఐఏఎస్ మొగుడు; ఐఏఎస్ పెళ్ళాం; శ్రీ సాయిప్రసన్న కంబైన్స్" విద్వాంసుడు - వియ్యంకుడు " జయలక్ష్మి ఫిలిమ్స్ "వియ్యంకుళ్ళు" విఘ్నేశ్వర ఆర్ట్‌పిక్చర్స్" జిల్లా కలెక్టర్" దివ్యసాయి క్రియేషన్స్ " రౌడీ లాయర్ " వెంకట కృష్ణా ప్రొడక్షన్స్ "ప్రేమరౌడి " ఓం విజయలక్ష్మి ప్రొడక్షన్స్" కోర్టులో రేప్ కేసు" జి.ఆర్.నాయుడ్ ఫిలిమ్స్ "డూప్లికేట్ అల్లుడు" రామా ఆర్ట్ క్రియేషన్స్" భారతంలో రాముడు " శ్రీరామచంద్ర క్రియేషన్స్" ఎం.ఎల్.ఏ చింతామణి" ఎంఎస్ కంబైన్స్ "కరోడ" కెవి ఆర్ట్ ప్రొడక్షన్స్"ఆంటీ"

కథకు సంబంధం లేక పోయినా కొందరు దర్శక నిర్మాతలు "సంఖ్యాశాస్త్రం" మీద నమ్మకంతో ఆతకని ఏవేవో పేర్లు పెట్టేస్తున్నారు. మరి కొందరు హిట్ అయిన చిత్రాల పేర్ల కోవలో నామకరణాలు చేసేస్తున్నారు. ఇవన్నీ ప్రేక్షకులకు కలగా పులగంగా ఉంటున్నాయి. అప్పటికే పేర్లు చూసి సినిమాలకు వెళ్ళే ప్రేక్షకుల ఉత్సాహం అంతకంతకు తరిగి పోతోంది!

### గ్రామీణ నేపథ్యంలో చిత్రాలు

గ్రామీణ వాతావరణం నేపథ్యంలో తయారైన "చంటి చిత్రం " సూపర్ హిట్ అయింది. అదే నేపథ్యంలో చిత్రాలు నిర్మించడానికి కొందరు నిర్మాతలు పూనుకున్నారు. పూర్ణోదయ వారి చిత్రంలో చిరంజీవి పాల వ్యాపారిగా కనిపిస్తే " ప్రెసిడెంట్ గారి పెళ్ళాం" లో నాగార్జున ప్రెసిడెంట్‌గా "రైతు భారతంలో " కృష్ణ రైతుగా , " చినరాయుడులో" లో వెంకటేష్ గ్రామీణ యువకునిగా కనిపించ బోతున్నారు. వాతావరణం, రూపాలంకారం,వస్త్రధారణలో తేడా ఉంటుందే గాని , శృంగారం, అకృత్యాలు వంటి బాక్సాఫీస్ మసాలాలు లేకుండా చిత్రాలు తయారవగలవా?

కాలేజి బుల్లోడు చిత్రంలో అక్కినేని, సత్యనారాయణ

### తమిళ ఆధారం గుట్టు

" చేరన్ పాండ్యన్ " అనే తమిళ చిత్రం హక్కులు కొని, తెలుగులో నిర్మిస్తోంది ఒక సంస్థ. తమిళంలో శరత్ కుమార్ పాత్రను డాక్టర్ రాజశేఖర్ . విజయకుమార్ పాత్రను శోభన్‌బాబు నిర్వహి స్తున్నారు. ఇది రీమేక్ అన్న విషయాన్ని దర్శకుడు గాని, నిర్మాత గాని, ప్రెస్‌మీట్‌లో చెప్పలేదు. కాని, శోభన్‌బాబు మాత్రం " నాకు ఉత్తమ నటుడు అవార్డు వచ్చే పాత్ర" అని అన్నారు. రీమేక్ చిత్రంలో నటించిన వారికి అవార్డ్ రాదన్న విషయం ఆయనకు తెలీదా. లేక అది రీమేక్ అన్న విషయాన్ని గోప్యంగా ఉంచదలిచారా- భ గ వంత ఎరుక.

### ముత్యాల సుబ్బయ్య శ్రీ లక్ష్మి పిక్చర్స్ చిత్రం

నెల్లూరీయుడు ముత్యాల సుబ్బయ్య స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో నందిగం సూర్యనారాయణ నిర్మించిన శ్రీ లక్ష్మి పిక్చర్స్ చిత్రానికి త్వరలో నామకరణం జరుగుతుంది. వినోద్ కుమార్, మీనా, యమున, సత్యనారాయణ, సాయికుమార్ , బాబూమోహన్, అన్నపూర్ణ తదితరులు నటించారు. కథ: ముత్యాల సుబ్బయ్య; సంగీతం: రాజ్- కోటి; మాటలు : తోటపల్లి మధు.

### అత్యల్ప స్వల్ప బడ్జెట్‌లో చిత్రం

" కనీస పక్షం ఎంత తక్కువ బడ్జెట్‌లో ఒక సినిమా తీయవచ్చో చూడటానికి ఓ ప్రయోగం చేస్తున్నారు. ఈ చిత్రంలో ఆరేళ్ళ కుర్రాడు , ఎనభై ఏళ్ళ వృద్ధుడు ప్రధాన పాత్రధారులు. "అన్నారు శ్రీ కోడి రామకృష్ణ. ఈయన లక్ష్యం విజయవంతమైతే, ఈ చిత్రం రికార్డ్ సృష్టించగలదనడంలో సందేహం లేదు.

### అభిలాష సొంత చిత్రం

తొలి చిత్రంలోనే ముప్పావు నగ్నంగా కనిపించిన అభిలాషకు పోటీగా మరి కొందరు తారలు తయారయ్యే సరికి ఆమెకు బుక్కింగులు కరువయ్యాయి. దాంతో ఆమె సొంత చిత్ర నిర్మాణానికి పూనుకోక తప్పలేదు. " పాడుకాప్పు" అనే తమిళ భయానక చిత్రంలో ఆమెతో పాటు వైష్ణవి, చార్మిళ, వరుణ్‌రాజ్ ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. కుమారరాజా అనే కొత్త సంగీత దర్శకుడు పరిచయం గావింప బడుతున్నాడు. కథ, చిత్రానువాదం, దర్శకత్వం: చంద్రమోహన్.

## అహంకారం ఎవరికి ?

కథ నాకు నచ్చాలి. పాత్ర సరిగ్గా కుదిరితేనే ఒప్పుకుంటాను, " అని సదా ఉద్ఘాటించే హీరో రాజశేఖర్ " అహంకారి"చిత్రం పరాజయానికి ఏమి సమాధాన మిస్తారు? కథ నచ్చాల్సింది ఆయన కన్నా ప్రేక్షకులకే. " ఈ చిత్రం రాజశేఖర్‌ని నెంబర్ వన్ స్థానంలో పెట్టేస్తుంది. " అని" అహంకారి" చిత్రం ప్రెస్ మీట్‌లలో దాసరిగారు పలుమార్లు చెప్పారు. ఆయన అంచనాలు తలకిందులయ్యాయి." మా ఇద్దరి కాంబినేషన్‌లో ఈ పిక్చర్ సూపర్ హిట్ అవుతుంది " అని దాసరి , రాజశేఖర్ కూడా కలసి అన్నారు. " అహంకారం ఉన్నది వీళ్ళకే "అని ప్రేక్షకులు తీర్పు ఇచ్చారు." చెప్పి చేయకండి" చేసి చూపించండి."

# అధ్వాన్న చిత్రం–అహంకారి

చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

పి. వెంకటరాజా, జి. శివ రాజు జంటగా నిర్మించిన 'అహం కారి' చిత్రంలో రాజశేఖర్ ఒకే రూపమున్న రెండు పాత్రలు పోషించాడు. ఈ ద్విపాత్రల్లో ప్రథమ పాత్ర ' సూర్య' అనే తండ్రి పాత్ర. ద్వితీయ పాత్ర " రాజేష్" అనే కొడుకు పాత్ర.

సూర్య అనే తండ్రి పెద్ద వ్యాపారవేత్త, అహంకారి. స్త్రీలోలుడు. డబ్బు మదంతో . కామ దాహంతో శృంగారయాత్ర సాగిస్తుంటాడు. ఆ దీక్ష సహాయం వగైరాలు యువకులకు చెయ్యకుండా యువతులకు మాత్రమే అందిస్తూ వారిని అందుకునేందుకు ఆరాట పడుతుంటాడు. తన మగతనం పెరిగేందుకు రోజూ ఇంజక్షన్ చెయ్యించుకుంటాడు. తన కామ క్రీడలు కొడుకు కంటబడకుండా కాపాడుకుంటాడు కాని ఇంటి ఇల్లాలు ( సుజాత) కంట తడి పెట్టినా పట్టించుకోడు. తన ప్రవర్తన మార్చుకోడు.

ఇలాంటి తండ్రికి కొడుకు రాజేష్. ఇతడు చాలా బుద్ధిమంతుడు. తన ప్రియురాలు నీలు (ఐశ్వర్య) ద్వారా తండ్రి శృంగార సరళి గురించి తెలుసుకుంటాడు. తండ్రిని మంచి మార్గంలో పెట్టేందుకు పథకాలు పన్నుతాడు. తన తండ్రి వల్ల మానభంగానికి గురై గర్భవతి అయిన శోభన(శోభన) శోకం చూచి బాధ పడతాడు. ఆ తప్పు తానే చేశానని తండ్రిచేత ఒప్పించేందుకు శోభనను తాను ప్రేమిస్తున్నట్లు పెళ్ళిచేసుకోబోతున్నట్లు నాటకమాడుతాడు.

విరుద్ధ భావాలు గల ఈ రెండు పాత్రలను రాజశేఖర్ గొప్పగా పోషించాడు. ముఖ్యంగా తండ్రి పాత్రలో అమోఘంగా నటించాడు. తండ్రీ కొడుకుల పాత్రల్లోని ఆయన నటనా వైవిధ్యం చప్పగా వున్న ఈ చిత్రాన్ని చాలా వరకు నిలబెట్టింది. ఈ రెండు పాత్రల్లోని రాజశేఖర్ నటన తప్ప ఈ చిత్రంలో చూడ తగింది మరేమీ లేదు.

కొనసా 10 పేజిలో

## ప్రకటన

ఇందుమూలముగా యావన్మందికి తెలియజేయునదేమనగా ఈ దిగువ కనపరచిన స్థలములను నా కక్షిదారుడు శ్రీ దువ్వూరు యుగంధర్, గాంధీనగర్, నెల్లూరు కాపురస్తుడు దాసిరెడ్డి వెంకురెడ్డి, తాళ్ళూరి ఆనంద కుమారి వగైరాలనుండి కొనుగోలు చేయుటకు తీర్మానము చేసికొని యున్నాడు. సదరు భూములకు సంబంధించి ఎవరికైన ఏవిధమైన ఆక్షేపణలు వున్న ఎడల ఈ తేది నుండి 15 రోజుల లోపల నాకు వ్రాతమూలకముగా తెలియపరచ వలసినది. లేని ఎడల సదరు భూములపై ఉత్తరోత్తరా రాబోవు వ్యవహారములకు మా కక్షిదారుడు గాని, అతని ఆస్తి గాని బద్ధగింప బడవు.

### ఆస్తి షెడ్యూలు

బురాన్‌పూర్ గ్రామం, H/o వెముడుగుంట, నెల్లూరు రూరల్ మండలంలో గల సర్వేనెం. 516/1, 520లోని ఎ.2-80సెంట్లు విస్తీర్ణములో గావలం చేయబడిన 35 ప్లాట్లు.

ఎస్. శ్రీనివాసులు రెడ్డి,
అడ్వకేటు
16/1146, గాంధీ నగర్,
నెల్లూరు - 524 001.

**In the Court of the District Munisif, Gudur**

OS. No: 73/90

State Bank Of India, Gudur
Rept by its Branch Manager
...Plaintiff

Vs

Duvvur Devasena
and Another ... Defendents

To
D2 - Batchala Venkata
Krishna Reddy
S/o Ramana Reddy
Resides at 15/277
Valayanandapuram, Gudur
Gudur Mandalam

**NOTICE**

పై నెంబరులో 2వ ప్రతివాదిపైన పై నెంబరు వాది దావా వేసియున్నారు. సదరు దావా తే. 17-6-92దికి వాయిదా వేయబడి యున్నది కావున సదరు 2 వ ప్రతివాది పైవాయిదా రోజు ఉదయం 10.00 గంటలకు పై కోర్టులో హాజరై ఆక్షేపణలు తెలుపు కోవలెయును. లేని యెడల మీ పరోక్షములో విచారించి తీర్మానించ బడునని యిందు మూలముగా తెలియజేయడమైనది.

P.N. MadanaMohan
Advacate for Plaintiff

## సింహపురి

(4 పేజీ తరువాయి)

పాటిపోయినా, రోళ్లు పగిలే వేడిమి మాత్రం తగ్గటం లేదు. [illegible] నిప్పులగా సూర్యుడు భగభగలా[illegible] బావుల్లో నీరు పెనం మీద వర్షం [illegible] బొట్లమాదిరి ఆవిరై పోతున్నాయి. దర్గామిట్టలో పదిశాతం బావుల్లో కూడా నీళ్లు లేవిప్పుడు. ఎంత పూడిక తీసినా జల ఊరడం లేదు. మునిసిపల్ కొళాయిలుండే ప్రాంతాలలో పర్వాలేదు. అవి లేని చోట్ల పరిస్థితి దారుణంగా వుంది. కొళాయిలలో కూడా నీళ్లు వచ్చే వేళలు దైవాధీనమైపోయాయి. కరెంట్ కోత వుణ్యమో లేక మరే కారణమో కాని, కొన్ని ప్రాంతాలలో రెండు గంటలు కూడా నీళ్లు వదలడం లేదు. బిందెడు నీళ్లు సంపాదించడం బ్రహ్మ ప్రయత్నంగా వుంది.

మునిసిపల్ కమీషనరు గారు ఆఫీసు వదలి బయటకు రారు. టౌన్‌లో, మరీ ముఖ్యంగా విస్తరణ ప్రాంతాలలో పరిస్థితి ఇంత దారుణంగా వుంటే ఆయనలో మాత్రం చలనం వచ్చినట్లు కన్పడడమే లేదు. కౌన్సిల్ వుంటే కనీసం కౌన్సిలర్లయినా తగుల్కొనే వారు; ఇప్పుడు అధికారుల రాజ్యమై పోయింది. అడిగే వాడే లేదు. మొన్నకరోజు దర్గామిట్ట ప్రాంతంలో మునిసిపల్ కొళాయిలు నిల్చిపోయాయి. రోజంతా బొట్టునీరు రాలేదు. బావులు ఎండిపోయి, కొళాయిలూ నిల్చిపోతే ప్రజలేమి కావాలి? బిందుపట్టుకొని వీధుల మట్టూ ప్రదక్షిణలు చేశారు జనం.

కమీషనరు గారు ఆఫీసు గది వదలి, అశ్రద్ధ జాడ్యం వదిలించుకొని, తన పరిపాలనలో పౌరులు పడుతున్న బాధలు చూడాలి; ఇతరత్రా ఏమీ చేయడం చేతకాకపోయినా కనీసం నీళ్ల సమస్యనైనా తీర్చాలి.

### వెంకటగిరి రాజా గారి సంగీత గేయధార

వెంకటగిరి రాజకుటుంబీకుడు, మాజీ శాసన సభ్యుడు శ్రీ సాయికృష్ణ యాచేంద్ర కవేకాక, మంచి సంగీత కారుడు కూడా! తానే గేయాలు రచించి, తానే పాడి, తానే రికార్డులు విడుదల చేస్తుంటాడాయన. ఆయన ఇటీవల 'సంగీత గేయధార' అన్న నూతన ప్రక్రియను కనిపెట్టారు. అష్టావధానం వంటి కళాక్రీడ ఇది. మొన్న 23 తేది టౌన్ హాల్‌లో డాక్టర్ సాయికృష్ణ యాచేంద్ర ఈ నూతన సంగీత విన్యాసాన్ని ప్రదర్శించారు. నెల్లూరు రూరల్ మండలాధ్యక్షుడు శ్రీ టి. రమణయ్య తన ఐదేళ్ల ప్రగతిని వివరిస్తూ ప్రచురించిన ఒక పుస్తకాన్ని ఆ రోజు ఆవిష్కరించారు. ఆ సభలోనే సంగీత గేయధార జరిగింది. డాక్టర్ సాయినాథ్, వర్ధమాన సమాజ కార్యదర్శి శ్రీ టి.వి. నరసింహం, శ్రీ జలపాపులూరు కామేశ్వర రావు, శ్రీ మంగళగిరి ప్రప్రుచ్ఛకులుగా వ్యవహరించారు. శ్రీ పచ్చిపులుసు వెంకటేశ్వర్లు మంచి ముచ్చట్లాడారు. కార్యక్రమాన్ని శ్రీ కె.పి.నారాయణ రావు అధ్యక్షించారు. ప్రచ్ఛకులు కోరిన గీతిలో చక్రవాకం, హంసనంది, ఆభేరి తదితర రాగాలలో శ్రీ యాచేంద్ర అశువుగా గేయాలాలపించారు.

అంతకు క్రితం పుస్తకావిష్కరణ సభను జిల్లాప మాజీ ఛైర్మన్ శ్రీ బేగానారసింహారెడ్డి అధ్యక్షించారు; శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి విశేష సంచికను సమీక్షించారు.

## ఎండాకాలం హైకూలు

తిరుమూరు సుధాకర్‌రెడ్డి

వేసవి వచ్చింది
మామిళ్లకు వేవిళ్లు
మనిషికి ఎక్కిళ్లు!

ఎండాకాలం ఉక్క
పగలు పక్క కుదరదు
రాత్రుళ్ళు లెక్క మిగలదు

తురాయి పూచింది
మొగల్ని తినేస్తున్నారు పిల్లలు
చెట్టుకిదేమీ పట్టదు!

రాత్రిపూలపక్కపై శయనించా
తెల్లారగట్ల చూస్తే
పక్కనిండా ఫ్యాక్టరీ ధూళి!

ఎండ దండయాత్ర చేస్తోంది
సైదుకాలువలో కుక్కపై
ఫ్రిజ్‌లో పనస చెక్కపై

ఐస్ పిల్లాడు వచ్చాడు
వాడి పెట్టెలో హేమంతం
గుండెల్లో గ్రీష్మం!

సెకండ్ షో వదిలారు
జనం వీధిన పడ్డారు
నను తొక్కేస్తూ వెళ్ళింది నిద్ర!

### చేపల చెరువులకు 24 వేల సబ్సిడీ

చేపల చెరువుల త్రవ్వకానికయ్యే ఖర్చులో హెక్టారుకు 20 వేలు. మేత తదితర ఖర్చులో 4 వేలు లెక్కన సబ్సిడీ ఇవ్వడానికి ఎఫ్ఎఫ్‌డిఎ నిర్ణయించింది. సబ్సిడీలకు కులపరమైన, సన్నచిన్నకారు రైతులన్న తేడా లేమీ వుండవు. 4 హెక్టార్ల వరకు సబ్సిడీ వుంటుంది. వివరాలకు ఎఫ్ఎఫ్‌డిఎను సంప్రదించండి!

### మోచర్ల జయంతి

వర్ధమాన సమాజం, శ్రీ మోచర్ల రామకృష్ణయ్య స్మారకనిధి సంఘ సంయుక్త యాజమాన్యంలో 'సరసకవి' మోచర్ల రామకృష్ణయ్య జయంతి సభ 6 తేది జరిగింది. శ్రీ దుగ్గొట్టి రమణయ్య అధ్యక్షించారు.

నెల్లూరు వేద సంస్కృత కళాశాల లెక్చరర్ డాక్టర్ అమృత వాక్కుల శేషకుమార్ మాళవికాగ్ని మిత్ర నాటకానికి మోచర్ల చేసిన అనువాద వైశిష్ట్యం గురించి సోదాహరణంగా, తులనాత్మకంగా వివరించారు. మూలకర్త శబ్ద ప్రయోగ వైచిత్ర్యాన్ని సరిగా అవగాహన చేసుకొని మృదుమధుర పదలాలిత్యంలో మూలమునకు కొన్ని చోట్ల మెరుగులు దిద్దిన విధానాన్ని మనోజ్ఞంగా వివరించారు శ్రీ శేష కుమార్.

'నటకావతంస' శ్రీ పొన్నాల రామసుబ్బారెడ్డి మోచర్ల వారి ప్రచండ భార్గవ నాటకంలోని కొన్ని పద్యాలను, శ్రీ డి.వి. రమణయ్య రచించిన కొన్ని పద్యాలను సుశ్రావ్యంగా గానం చేసి అందరిని తన్మయుల జేశారు. శ్రీ శ్రీనివాసరావు వయొలిన్ వాద్యంలో సహకరించారు. పొన్నాలను అధ్యక్షుడు శ్రీ రమణయ్య, ఉపన్యాసకులను మోచర్ల మనుమడు సన్మానించారు. వర్ధమాన సమాజ కార్యదర్శి శ్రీ టి.వి. వరహింహులు స్వాగతించారు.

## చిత్రసమీక్ష

([illegible] పేజీ తరువాయి)

రాజశేఖర్ నటన చిత్రాన్ని ఎంతగా నిలబెట్టిందో, దాసరి నారాయణరావు దర్శకత్వం అంతగా దిగజార్చింది. ప్రతి సన్నివేశమూ నీరసంగనే వుంది. తండ్రిని [illegible] క్రీడలనుంచి మళ్ళించి, మంచి మార్గంలో పెట్టేందుకు కొడుకు పన్నిన పథకం బాగున్నా అది చిత్రీకరణలో బెండులా తేలిపోయింది. లేవన శక్తికి తండ్రి తీసుకునే ఇంజక్షను విషయం కొడుకు ఒక పిచ్చి డాక్టర్ (బ్రహ్మానందం) వద్దకు వెళ్ళి అడగటం, అక్కడ ఆడాక్టర్ భార్య బోక్యం చేసుకోవటం అదంతా హాస్యం కోసం ఒక రకంగా, వెగటుగా తయారు చెయ్యబడింది. అలా చాలా సన్నివేశాలు వెకిలిగా కనిపిస్తాయి. చిత్రం చివరన సూర్య ప్రవర్తనకు విసిగి అతని భార్య, అతను చేసిన మానభంగానికి గర్భవతైన శోభన ఆత్మహత్యలు చేసుకోబోవటం, వారిని వివాహించేందుకు సూర్య చేపట్టిన గుళ్లో ప్రాణాచారాలు, నిప్పుల్లో దూకటాలు [illegible] వెగటుగా వున్నాయి. సూర్య మన[illegible] మార్చుకొని భార్యను ఒకవైపు, శోభనను మరో భార్యగా మరోవైపు దగ్గరకు తియ్యటం, ఇద్దరు భార్యల నిపేద దక్షాన్ని ఆవహాస్యం చేస్తున్నది. దాసరి మంచినటుడే గాని మంచి దర్శకుడు కాదని ఈ చిత్రం మరోసారి ఋజువుచేస్తుంది.

చెప్పుకో తగ్గ విషయం మరొకటి వుంది. అది శ్రీకాంత్ ఫోటోగ్రఫీ తండ్రీ కొడుకుల పాత్రల్లో రాజశేఖర్‌ను ముఖ్యంగా తండ్రీ కొడుకులు ఒకరి ప్రక్కన ఒకరు చాలా దగ్గిర వుండి మాట్లాడుకునే దృశ్యాలను అద్భుతంగా రూపొందించారు శ్రీకాంత్.

వేటూరి వ్రాసిన పాటలు రాజ్‌కోటి సంగీతంలో వినడానికి బాగున్నాయి కాని ఆపాటలను దృశ్యరూపం కల్పించటంలో వాటిని నాశనం చేశారు దర్శకుడు. ఇక్కడ ఇంకో విషయం గూడా చెప్పుకోవలసి వుంది. అది, దర్శకుడుగా ఒడిపోయి, సినిమాలకు మాటలు వ్రాసుకుంటున్న జంధ్యాల విషయం. ఈ చిత్రంలో ఆయన మాటలు ఒకటి రెండు సన్నివేశాల్లో బాగున్నా మొత్తం మీద [illegible] వున్నాయంటే జంధ్యాల నమ్ముకుంటారేమో!



## బహిరంగవేలము

1) పి. నరేంద్ర కుమార్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్. నెం.150 రు 762 ఎ గిరిపురం తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 10.1.91 నుండి 2.5.91 తేది వరకు గల విడిపించని పద్దులు 20.6.92 వుదయం 10 గంటల నుండి 762 ఎ గిరిపురం తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

2) షాకిస్తూర చంద్ అశోక్ కుమార్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్. నెం 200రు 3 వ లైను బ్రాడీపేట - గుంటూరు - వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 15.10.90 నుండి 31.12.90 తేది వరకు గల విడిపించని పద్దులు 25.6.92 తేది వుదయం 10 గంటల నుండి 3 వ లైను బ్రాడీపేట గుంటూరులో పై అడ్రసు గల వారు అంగడిలో బహిరంగముగా వేలము జరుపబడును.

3) శ్రీ లక్ష్మి వెంకటేశ్వర అండ్ కో పి.బి.యల్. నెం. 63 రు 7/256 మిట్టవీధి - తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 24.11.90 నుండి 25.2.91 తేది వరకు గల విడిపించని పద్దులు 30.6.92 తేది వుదయం 10 గంటల నుండి 7/256 మిట్టవీధి. తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

4) శ్రీ లక్ష్మి వెంకటేశ్వర పాన్ బ్రోకర్సు పి.బి.యల్.నెం 207/88 రు 118 నిమ్మకాయల వీధి. తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 10.4.90 నుండి 17.4.91 తేది వరకు గల విడిపించని పద్దులు 6.7.92 తేది వుదయం 10 గంటల నుండి 118 నిమ్మకాయల వీధి తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

5) వున్‌రాజ్ - రామ్‌లాల్ జైన్ పాన్ బ్రోకర్సు పి.బి.యల్. నెం 88 రు 1-101-1 పోస్టాఫీసు వీధి. రేణిగుంట వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 2.1.91 నుండి 31.5.91 తేది వరకు గల విడిపించని పద్దులు 10.7.92 తేది 1-101-1. పోస్టాఫీసు వీధి రేణిగుంటలో బహిరంగముగా వేలము జరుపబడును.

6) కావేరి పాన్ బ్రోకర్సు పి.బి. యల్. నెం. 6/85-86 రు 14.9.134 గుర్లింగుపేట చిత్తూరు వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 13.8.89 నుండి 10.9.90 తేది వరకు గల విడిపించని పద్దులు. 11.7.92 తేది వుదయం 10 గంటల నుండి 14.9.134 గుర్లింగు పేట. చిత్తూరులో బహిరంగముగా వేలము జరుపబడును.

7) శ్రీ లక్ష్మి బాలాజీ పాన్ బ్రోకర్సు పి.బి.యల్. నెం 8/81-82 రు 10.559-5 సంతపేట నెల్లూరు వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 11.5.87 నుండి 13.6.89 తేది వరకు గల విడిపించని పద్దులు 15.7.92 తేది వుదయం 10 గంటల నుండి 10.559-5 సంతపేట. నెల్లూరులో బహిరంగముగా వేలము జరుపబడును.

8) శాంతి లాల్ చలిలాల్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్. నెం 56/85 17x1 అరండల్ పేట - గుంటూరు వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 3.11.88 నుండి 18.4.91 తేది వరకు గల విడిపించన పద్దులు 30.7.92 తేది వుదయం 10 గంటల నుండి 17x1 అరండల్ పేట గుంటూరులో బహిరంగముగా వేలము జరుపబడును.

కె.వి. రామకృష్ణరావు
11/268 సంతపేట, నెల్లూరు

## పినాకినీ తీరం

2 పేజీ తరువాయి

ఇంకో యువకుడు నెల్లూరి (యు.తే) సర్వతో సంస్కారాలు గిరిగిన యువకుడు. అతన్ని చూస్తే అభిమానం కలుగుతుంది. అతని ప్రవృత్తి రాజకీయాలేమో తెలియదు గాని, ప్రవృత్తి మాత్రం అది కాదు. మద్రాసులో ఏదో పని చేసుకుంటున్నారు. రాజకీయ, సంఘసేవా రంగాల్లో ఎప్పుడూ పని చేసినట్లు నేను వినలేదు. నాయకులకు పెద్ద పూలమాల లియ్యడం, అలంకార ప్రాయంగా ఏదైనా పదవి సంపాయించు కోవడం, వార్తా చిత్రాలే కాకుండా వ్యయాన్ని తానే భరించి అభినందన ప్రకటనలు తానే యిప్పించు కోవడం. ఆ యువకునికి అలవాటై పోయింది. ఆయనకు మొన్న సెన్సార్ బోర్డు సభ్యత్వం కూడా వచ్చింది; పత్రికలలో ఎంతెంత పెద్ద అభినందన ప్రకటలనుకున్నారు ? ఈ ఎంతెంత పెద్ద బొమ్మలనుకున్నారు. చిన్న పదవికి అంత పెద్ద హంగామానా? నేటి యువకుల్లో, ముఖ్యంగా కాంగ్రెస్ యువకుల్లో ఈ సంస్కృతి ప్రబలిపోతున్నది. పదతత్వంతోనే, సిఫారసుల మొగమోటంతోనో, మరే ఇతర ప్రలోభాలతోనో కాంగ్రెస్ నాయకులు కూడా గ్రుడ్డిగా పదవులను అపాత్రదానం చేస్తున్నారు. వారు వాటిని స్వలాభం కోసం వినియోగించుకుంటున్నారు. నిజం వ్రాస్తే మొహం మాడుస్తారు. కాని ఇటువంటి వారి వల్ల పార్టీకి, పార్టీ నాయకులకు లాభం చేకూరకపోగా, విపరీతమైన నష్టం కలుగుతున్నది!

నెల్లూరులో ఇటీవల రెండు సందర్భాలలో రోడ్డు మీద కట్టబడిన రెండు ఆర్చిల మీద ఒక యువ నాయకుని బొమ్మను, ఆయన ఇష్టసఖుని చిత్రాన్ని – పెద్దనాయకుల వరుసలో, వారి స్థాయిలో చూడడం తటస్థించింది. వారిలో ఒకరు అందరికి తెలిసిన వాడు; అతనిని తెలియని వారు, చూడని వారు, అతని పేరు వినని వారు లేరు. అటు వంటి సుపరిచితుడైన వ్యక్తి ఆర్చి మీద కూడా తన బొమ్మను చూచుకోవాలని ఉబలాట పడడం. దారిని వచ్చే పోయే వారు చూడాలని ఉబలాటపడటం ఎందుకో ఆశ్చర్యం!

గాలి కొడితే బొజ్జ పెరగదు. సొంత ప్రచారాలతో ప్రజానురాగం పొందలేరు. బొమ్మలతో, వినోదాలతో నాయకత్వం రాదు. సేవ, చిత్తశుద్ధి, నిలకడైన వర్తనతో ప్రజల గుర్తింపు లభిస్తుంది. యువకులు ఈ మార్గాన్ని అనుసరించాలని నా కోర్కె.

"నువ్వు పాతకాలం మనిషివి, చాదస్తుడివి. కాలం మారింది నువ్వు మారలేదు; విలువలు మారాయి. [illegible] మార్చుకోలేదు; వేగం పెరిగింది. [illegible] నత్తనడకలోనే వున్నావు; అభిప్రాయాలు తరతరాల [illegible]" - యువకులు నన్నంటే [illegible]కోచం లేకుండా అవును అని త[illegible] వూపుతాను!

ఎన్.ఎం.

## జనవాణి

3 పేజీ తరువాయి

### హిందూ దేవతలను చులకనగా చూడవద్దు

గతవారం 'సణుగుడు' లో శ్రీ రాజరాజేశ్వరి దేవాలయాన్ని రోడ్‌సైడ్ టెంపుల్‌గా అభివర్ణించారు. అన్నీకాకున్న మనకున్న దేవాలయాలలో అధిక భాగం రోడ్‌సైడ్‌వే కదా? పవిత్రమైన దైవ సన్నిధిలో కళ్యాణమండపం వెలవడం సామాన్యుడికి ఎంత ఊరట? టిటిడి కళ్యాణ మండపం కలవారి పెళ్ళిళ్ళకే కదా [illegible]మితం! ఈ దేవాలయాన్ని దారిన పోయే వారి చందాలతో కట్టినట్లు చులకనగా వ్రాశారు. హిందూ దేవతలను చులకనగా వ్రాయడం భావ్యంకాదు

-ఎస్ కె ఆచార్యులు

నెల్లూరు



కేంద్ర సమాచార ప్రసారశాఖ ప్రాంతీయ ఫిలం సెన్సార్ బోర్డ్ సభ్యుడు, దక్షిణ భారత కాంగ్రెస్ యువనాయకుడు శ్రీ కేతిరెడ్డి జగదీశ్వర రెడ్డి నెల్లూరు విచ్చేసినపుడు స్వాగతం చెప్తున్న యువజన కాంగ్రెస్ కార్యకర్తలు



## హమీలు
(4 పేజీ తరువాయి)

క్రీడల పోటీలు కొన్నయినా నెల్లూరులో నిర్వహించే వీలు కల్గుతుంది.

మొత్తం 58 హామీలకు గాను పెండింగ్‌లో వున్నవి రెండంటే రెండు. ఒకటి బుచ్చిరెడ్డిపాళెంలో ఎపిఎస్ఆర్‌టిసి ఆఫీసును తిరిగి ప్రారంభించే నిర్ణయం; ఆ కార్పొరేషన్ ఎండి దగ్గర నానుతూ వుంది. నెల్లూరు చెరువు పెన్నా నదులను కలుపుతూ కాలువ నిర్మించడం ద్వారా టవున్‌కు మంచి నీటి సరఫరా మెరుగు పరచే పని, ఎస్టిమేషన్ల స్థాయిలోనే వుంది. ఇవి రెండు తప్ప తక్కిన 56 హామీలూ అమలైనట్టే లెక్క. ఇక వాటితో ముఖ్యమంత్రి ప్రమేయం లేదు. వాటి క్రమంలో అవి జరిగిపోతాయి.

వాస్తవ పరిస్థితి ఇది! కాని కొన్ని దినపత్రికలు చదివే పాఠకులు, జిల్లాలో ముఖ్యమంత్రి మాటలు నీటిమూటలై పోయాయన్న అభిప్రాయానికి వచ్చే పరిస్థితి కల్పించబడుతున్నది. ఆ వార్తలు అట్లా వున్నాయి. పథకం ప్రకారం జరుగుతున్న ఈ వార్తా దుష్ప్రచారాన్ని ఇటు జిల్లా యంత్రాంగం కాని, అటు సమాచార శాఖ కాని సరిదిద్దే ప్రయత్నం చేయడం లేదు. పత్రికల వారికి, సమాచార శాఖకు మధ్య సంబంధాలు అంటూ ఏవీ లేకపోవడం కూడా ఈ రకమైన ప్రచారాలకు దారి తీస్తుందేమో ననిపిస్తున్నది.





## గుడివాడ సబ్ కోర్టులో

ఒ.యస్. నెం25/91, ఇ.పి.నెం. 111/91

డి.హెచ్.ఆర్. దావరి దుర్గా మల్లేశ్వరరావు మరియు
జె.డి.ఆర్. నక్కలపూడి వెంకటేశ్వర రావు

ఈ నెంబరులోని డిక్రీ బాకీ క్రింద జె.డి.ఆర్. తాలుకు ఈ దిగువ షెడ్యూలు దాఖలా ఆస్థి 22.6.92 తేది ఉదయం 10.30 గంటల నుండి కోర్టు వారి ఎదుట బహిరంగ వేలము జరుగును. కనుక కావలసిన వారు పాట కాలమందు హాజరై పాట పాడుకొనవచ్చును.

**వేలము అగు ఆస్థి వివరము :**

కృష్ణాజిల్లా గుడివాడ సబ్ రిజిష్టారు వారి యిలాకా గుడివాడ టౌనులో వున్నటువంటిన్ని. ఈ నెంబరు జె.డి.ఆర్‌కు సంపూర్ణ స్వాధీన హక్కు భుక్తములు కలిగినటువంటిన్ని. ఈ నెంబరు డిక్రీ క్రింద ఎటాచ్‌మెంట్ బి ఫోర్ జడ్జిమెంటు కాబటి ఖాయం కాబడి సేలు కావలసిన స్థిరాస్థి వివరము :

ఆర్.ఎస్.నెం. : 1597, డి. నెం. 14/336 లో గల యింటికి హద్దులు : తూర్పు : వంకినేని చలపతి రావు గారి రైసు మిల్లు; దక్షిణం : ఎ. గోపాలరావు గారు; పడమర : వి. చలపతి రావు; ఉత్తరం : మెయిన్‌రోడ్డు

ఈ హద్దుల మధ్య య. 0003 సెంట్లు అందులో గల యిల్లు. అందుకు సంబంధించిన యావత్తు విశిష్ట కలప సామానులతో సహా.

1. ఇ.సి. దాఖలా 1వ ఎంట్రీ ప్రకారము జె.డి.ఆర్. ఖరీదు చేసియున్నారు.
2. ఇ.సి. దాఖలా 2 వ ఐటము ప్రకారము జె.డి.ఆర్. గుడివాడ కోఆపరేటివ్ అర్బన్ బ్యాంకుకు వుంచిన అస్వాధీనపు తనఖా తీరిపోయినది. కనుక లోబడవలసిన అవసరము లేదు.
3. ఇ.సి. దాఖలా 3 వ ఎంట్రీ ప్రకారము జె.డి.ఆర్. పెరుమాళ్లకుసుమ కుమారి గారికి క్రయము. సదరు క్రయము లాలూచి అయివున్నది. కనుక సదరు క్రయమునకులోబడవలసిన అవసరము లేదు.

కనుక ఫ్రీ ఆఫ్ ఎన్ కంబరెన్సుగా బలము కావలెను.
డి.హెచ్. ఆర్. కిమ్మత్తు : రు. 75,000/-
అమీనా కిమ్మత్తు: 1,00,000/-
జె.డి.ఆర్. కిమ్మత్తు యిచ్చియుండలేదు.

టి.ఎన్. పి శేఖర్
డి.హెచ్.ఆర్. తరఫున న్యాయవాది.



# రావూస్

ఫోన్స్ : 26046, 23781

## రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి

బి.యన్.టి. రోడ్డు, బుజబుజనెల్లూరు, చెముడుగుంట పోస్ట్, (బాలాజీ స్టీల్స్ సమీపంలో) ఆఫీసు : రావూస్ కోచింగ్ సెంటర్, చాకలివీధి, నెల్లూరు.

అత్యుత్తమ శిక్షణ | అపూర్వఫలితాలు | ఆధునిక వసతులు




నెల్లూరుకు 7 కి.మీ. దూరంలో రణగొణ ధ్వనులకు దూరంగా, ప్రశాంత వాతావరణంలో నెలకొల్పబడింది. అనుభవజ్ఞులైన ఉత్తమ అధ్యాపకులచే సుశిక్షణ. రెసిడెన్షియల్ వారెన్‌లచే పర్యవేక్షణ. చక్కని లేబొరేటరీ సౌకర్యం, మంచి లైబ్రరీ మరియు అన్ని వసతులు కలవు.

జూనియర్ ఇంటర్: M.P. & Bi.P (TM & EM) లకు అడ్మిషన్లు ప్రారంభమైనవి. రూ. 30/- M.O./D.D. పంపి అప్లికేషను, ప్రాస్పెక్టస్ పొందవచ్చును. క్లాసులు జూన్ 20 నుండి ప్రారంభం.

సీనియర్ ఇంటర్: క్లాసులు జూన్ 1 నుంచి ప్రారంభమైనవి.

**NOTE:** ఇతర కాలేజిలలో జూనియర్ ఇంటర్ చదివి, సీనియర్ ఇంటర్ మా కాలేజిలో చేరుటకు ప్రవేశము కలదు.

ఫీజు వివరాలు : ఇంటర్, ఎంసెట్ మెటీరియల్‌తో సహా శిక్షణ, వసతి, పర్యవేక్షణతో భోజనము మొత్తం ఫీజు కేవలం రూ. 12,000/- మాత్రమే ఫీజు 3 వాయిదాలలో చెల్లించవచ్చు. డే స్కాలర్స్‌కి ప్రవేశం కలదు. ఫీజు కేవలం రూ. 4,000/-

### మెరిట్ విద్యార్థులకు రాయితీలు

10 వ తరగతి స్టేట్ ర్యాంకులలో 10 లోపు ర్యాంకు పొందిన వారికి శిక్షణ, భోజనం వసతి ఉచితం.

500 మార్కులు సాధించిన విద్యార్థులకు రూ. 2,000/-
400 మార్కులు సాధించిన విద్యార్థులకు రూ. 1,000/-
450 మార్కులు సాధించిన వారికి రూ. 1,500/-
ఫీజులో మినహాయింపులు ఉంటాయి.

**NOTE:** ఇంటర్‌లో మెరిట్ స్కాలర్ షిప్ ఇవ్వబడును.

స్థాపితం : 1983 ఫోన్స్ : 26046, 23781



# రావూస్
## కోచింగ్‌సెంటర్

వి.ఆర్.సి. ఎదురుగా, చాకలివీధి, నెల్లూరు -1

గత 9 సంవత్సరాలుగా అత్యుత్తమ ఫలితాలందిస్తున్న విద్యాసంస్థ

సీనియర్ ఇంటర్M.P & Bi.P (EM & TM) అడ్మిషన్లు జరుగుచున్నవి. సీనియర్ ఇంటర్ రెండవ బ్యాచ్ జూన్ - 5 నుండి ప్రారంభమైనది. మూడవ బ్యాచ్ – జూన్ 25 నుండి ప్రారంభం.

జూనియర్ ఇంటర్ M.P & Bi.P (EM & TM) అడ్మిషన్లు జరుగుచున్నవి. క్లాసులు జూన్ - 5 నుండి ప్రారంభమైనవి. రెండవ బ్యాచ్ జూలై - 6 నుండి ప్రారంభం. గత సంవత్సరాల వలెనే ప్రతి సబ్జెక్టులోనూ సీనియర్ ఇంటర్ సిలబస్ సెప్టెంబర్ ఆఖరుకు పూర్తి చేసి అక్టోబరు నుండి EAMCET కోచింగ్ యివ్వబడును.

**NOTE:** ముందుగానే అడ్మిషన్లు తీసుకొని స్టడీ మెటీరియల్ పొందవచ్చును.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET printing at Nayagara Books Pvt. Ltd. Nellore.